శ్రీ

# మదనగోపాలశతకము.



మేకా బాపన్న గారిచే

సకల భగవద్భక్త జనోపయోగకర మగునటుల

రచియింపఁబడి,



వాసి పొత్తూరి, సుబ్బారాయుడు గారి సతీమణి, వల్లమ్మగారిచే

తృతీయ ముద్రణము గావింపఁబడి, ప్రచురింపఁబడినది.

ఆచంట

పశ్చిమ గోదావరి జిల్లా.

**1956**

ప్రతులు 1000





...సల్ ప్రింటర్సు, మారుటేరు.

శ్రీ

# మదనగోపాలశతకము.



మేకా బాపన్నగారిచే

సకల భగవద్భక్త జనోపయోగకర మగునటుల

రచియింపఁబడి,



వారి పౌత్రులు, సుబ్బారాయుడు గారి సతీమణి, పల్లమ్మగారిచే

ద్వితీయముద్రణము గావింపఁబడి, ప్రచురింపఁబడినది.

ఆచంట

పశ్చిమ గోదావరి జిల్లా.

**1956**

ప్రతులు 1000





...సల్ ప్రింటర్సు, మారుటేరు.

శ్రీ

# మదనగోపాలశతకము.



మేకా బాపన్నగారిచే

సకల భగవద్భక్త జనోపయోగకర మగునటుల

రచియింపఁబడి,



వారి పౌత్రిలు, సుబ్బారాయుడు గారి సతీమణి, వల్లమ్మగారిచే

తృతీయముద్రణము గావింపఁబడి, ప్రచురింపఁబడినది.

ఆచంట

పశ్చిమ గోదావరి జిల్లా.

1956

ప్రతులు 1000



నేషనల్ ప్రింటర్సు, మారుటేరు.

# పరిచయము.

శ్రీలకావాసమై, సకల భక్త జనావళి కాలవాలమై, వివిధ విద్యా విశారదుల కిరవై, అర్థిజన రక్షాదక్షులైన శ్రీఉమా రామేశ్వరస్వామి, శ్రీ మదన గోపాలస్వామి వారలచే పరిరక్షితంబై, విశ్వ విఖ్యాతి నందిన మార్తాండపురమను నామాంతరముగల ఆచంటపురవరము వశిష్ఠగోదావరికి పశ్చిమ పార్శ్వంబున నొప్పారుచున్నది. "ఒడయనంబి" యను భక్త శిఖామణి 'పరమనాచి' యను వారాంగన కుచంబును అర్ధరాత్రింబున "శివ లింగ"ముగ భావనచేసి. యర్చించుపట్టున నాపె మేల్కాని, పరిహసింప, నాత డప్పరమేశ్వరుని దండక స్తోత్రాదుల బ్రస్తుతింప, భక్తవత్సలుండగు మహేశ్వరుఁడు సాక్షాత్కరించి యమ్మిథునమునకు సాయుజ్య సౌఖ్యంబు లొసంగె. నంత, 'చంట' వెలసి పల్కుటంజేసి "ఆచంట" యను నామ మన్వర్థంబయ్యె ననునది స్థలపురాణాంశము,

అట్టి ఆచంట పురమున బ్రసిద్ధిగన్న కమ్మ వంశంబునందు మేకా నాగయ్య చల్లమాంబల గర్భశుక్తిముక్తాఫలంబైన "బాపన" యను పరమ భాగవతోత్తముఁడు సకల భక్త జనోపయోగ కరంబగు నటుల భక్తి రస ప్రధానముగ శ్రీరామేశ్వర, మదనగోపాల శతకముల రచించి. "పండిత బాపన" యను యశమంది పరమ పదవినందెను.

తదనంతరము వారి సోదరుని పుత్రులు, నాగన్న. తిరపయ్య యను వారలు ఆ శతకములను 1908 సం॥రంలో ముద్రణచేయించిరి. అప్రతులు నే డెచ్చటనోగాని కానరాకుంటచే అనేకుల ప్రోద్బలమున "పండిత బాపన్న" గారి పౌత్రులు, వెంకటసుబ్బారాయుడుగారి పుత్రులు, సుబ్బారాయుడుగారు వీనిని పునర్ముద్రణ చేయింప నుత్సహించిరి. కాని వారి కాలమున సంపూర్తి గావింప బడనందున, వారి సతీమణి పల్లమ్మగారు భక్తితో పై శతకముల నచ్చొత్తించి, ప్రకటించి యున్నారు. భగవద్భక్తు లగు వీరికి సకలేప్సితంబుల గూర్చి, పరమేశ్వరుఁ డనిశంబు సంరక్షించు గాత మని మా విశ్వాసము.

పెనుగొండ,
10-7-1956

ఇట్లు.
కోట నరసింహామూర్తి.
గౌ॥ సంపాదకుడు: 'సర్వోదయ'

# అభిప్రాయము.



శ్రీ ఆచంట రామేశ్వర శతకమును, శ్రీ మదనగోపాల శతకముల నచ్చటచ్చటఁ జదివినాడను. వీనియందుఁ గవియొక్క రచనా వైశిష్ట్యము పాండిత్యముతోఁ బ్రౌఢమై యుండినట్లు చూచినంతనే దృగ్గోచరముగా గలదు. ఈ శతక రచయిత యాంధ్ర సంస్కృతములం దసమాన పండితుడును, గవియునై యుండుటయే దీనికిఁ గారణము.

ఈ కవి శతకద్వయమందును శివ కేశవుల సీస పద్య సుమములచే నర్చించి వారియందు సమాన భక్తి భావమును ప్రదర్శించినాడు. ఇందు శ్రీ ఆచంట రామేశ్వర శతకము క్రీ. శ. 1850 లోను, క్రీ. శ. 1863 లో శ్రీ మదన గోపాల శతకమును రచియించినట్లు కవి చెప్పికొనియుండెను. ఈ శతకముల యందలి పద్యములు స్తోత్రప్రయోగములై, శ్రావ్యములును నర్థగాంభీర్యమునుఁ గల్గియున్నవి.

ప్రాచీనకవుల వలెనే యీ కవియు, ఇష్టదేవతా ప్రార్థనాదులు చేసి యుండెను. ఇతడు మేకావంశమున నాగయ్య చల్లమాంబలకు జ్యేష్ఠపుత్రుడైనట్లు వ్రాసికొని యుండెను. కవియు, భక్తశిఖామణియు నగు నీతని కోరికకుఁ దగినట్లీగ్రంథము మూడవ ముద్రణమును పొందుచుంటఁ జూడనిది సర్వవ్యాప్తినొంది భక్తుల కుపయోగ్యమై, చిరయశము నార్జించు ననుటలో సందియములేదు. భక్తిప్రబోధ శతకములలో నీ రెండును చిరకీర్తినొందు గాక!

ఇట్లు.

ఆచంట, 15-7-56

గోదావరి వల్లభేశ్వరశర్మ,
సీనియర్ తెలుగుపండితులు, బోర్డుహైస్కూలు.

సీ॥ చతురబ్ధి వలయిత క్ష్మాతలంబున బేరు
వడసిన యాచంట వరపురంబు,
ఆపురం బిందిర కాపురం బనదగు
పంటపాడికి భువి జంటలేక,
రామలింగేశ్వర నామంబుచే నుండు
ప్రమథ గణాళితో భర్గుఁడిచట,
శ్రీరామలింగేశు సేవాళిలో నొకఁడనఁ
పరమ ప్రసిద్ధుండు, భవ్యయశుఁడు,
విష్ణు పాదోద్భవ విఖ్యాత కులజుండు,
ఘనుఁడు, మేకావంశ వనధి చంద్రుఁ
డలఘు భక్తుఁడు, బాప నాహ్వాయ శుభగుండు,
సర్వ పురాణ షట్ శాస్త్ర విదుఁడు,
వేద రహస్యాళి విస్తార విశదుండు,
సత్వ గుణైశ్వర్య శర్వసఖుఁడు,
రామలింగేశ్వర నామాంకితంబుగ,
భాసిల్లు మదన గోపాలు పేర,
శతకముల్ రెండును చయ్యన రచియించి,
పరమపదించెను ధరపలోన,
ఇతని తమ్ముఁడు రామకృష్ణుండు, హరిపద
భక్తి వర్ధిష్ణుండు, భవ్యుఁడరయ,
పుత్రద్వయంబును బొల్పొందగాంచెను,
సత్య వాక్శోభిత సరసులనఁగ,
నాగన్న, తిరపయ్య, నామధేయులు, ధర్మ
కార్యాను కూలురు, కారుణికులు,

ఆ॥వె॥ పితృ పితృవ్య కీర్తి బెంపొందగా జేసి,
పితృ ఋణమును దీర్చి, పేరుగాంచ,
వీని నచ్చునొత్తి వెలయింపజేసిరి,
ధరణి నర్క చంద్ర తారకముగ॥

# - గ్రంథకర్త వంశావళి -



మేకా నాగయ్య
'పండిత' బాపన్న.
రామకృష్ణమ్మ.
అబ్బాయి అనే చిన బాపన్న.
వెంకటసుబ్బారాయుడు.
నాగయ్య.
తిరపయ్య.
సంతతి: ఆరుగురు కుమాళ్లు.
(ద్వితీయ ముద్రణ చేయించిరి.)
బాపన్న.
వీరన్న.
సుబ్బారాయుడు.
అచ్యుతరామయ్య.
రామకృష్ణయ్య.
వీరి సతీమణి, పల్లమ్మగారు.
(తృతీయ ముద్రణము వేయించిరి.)

శ్రీరస్తు!



   

# శ్రీ మదన గోపాల శతకము.

శ్రీ కంఠ, పరమేష్ఠి, సేవిత! పద్మాక్ష!
పద్మాక్ష మా చిత్త పద్మ భసల!
భసల లలితాంఘ్రి సరసిరుహానన ఖర
ఖరకరజని రక్ష కామ జనక!
జనకర్ణ భూషణ చరిత దామోదర!
మోద రంజిత నేత్ర పాద వరద!
వర దయాకర! దుష్ట వనరుహా వనగజ!
నగజా స్తవ ప్రియ నలిన నయన!

గీ॥ నయనతావన చణగుణ నాగ శయన!
శయన, నయన ధృత నందక శంఖ చక్ర!
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ ఘన ఘనా ఘన రమా కలితాప ఘన ఘన
ఘనవాహ ముఖ సుర గదిత మహిమ
హిమ కరోపమనఖ కమనీయ పదభాగ
భాగత కాంచన పటు వికాస
కాసరాశ్వ తనూజ కామిత పూరణ
రణరంగ విజితాశరావ నీప
నీ పాంసుయాజప నియమ నామ విశేష
వాగ విషయ సిద్ధ వంద్య భూమ
గీ॥ భూమ హార్భర నిరసన కామ భావ
భావ భవకోటి భాస్వర ప్రౌఢ రూప!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ హార మందార నీహారహీరాకృతి
శయధృత శుక కర్కశాత హేతి
విద్యావి నిద్రాణ విబుధగేయ ఖ్యాతి
దుగ్ధాప్తి విశ్రుత దేవ భూతి
వల్లకీరవ మేళ వర సముద్యద్గీతి
వితత విద్యా దాన విదిత రీతి
కవితా రసస్వైరగము సిద్ధ కవిజాతి
నయమార్గ సేవమాన ప్రసూతి
గీ॥ సాతిశయ దయ నజనాతి స్ఫాతి మత్ప్ర
ణీత కృతి యందు సమకూర్చి నెగడుగాత!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జనపాల! మదన గోపాల బాల!

సీ॥ సజల నీలాంబుద శ్యామల రుచి గాత్రు,
వైకుంఠలోక నివాస పాత్రు,
సర్వసుపర్వ సుస్తవనీయ చారిత్రు,
ఆపదాంబోనిధి యానపాత్రు,
బ్రహ్మాది సురమౌళి రంగనాటితవేత్రు,
భవపాశ మోచన ప్రకట సూత్రు,
శ్రీకారి పాదావ చిత్రజన వన చైత్రు,
ధీనిధి సూత్రవతీ కళత్రు,

గీ॥ నచిరసమయ నిరంతర మస్మదీయ
కృతి సమాప్తికి నతిభక్తి మతి నుతింతు,
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజన పాల! మదన గోపాల బాల!

సీ॥ నెత్తమ్మి మాళిగ నెలకొన్న పూబోడి,
రాచిల్క తత్తడి రౌతుతల్లి,
ముక్కంటి తలపూవు ముద్దు తోబుట్టువు,
ముజ్జగంబులు నేలు ముద్దరాలు,
సోకుమూకల దోలుజోడు పట్టపురాణి,
కలుముల నీనెడి కల్వకంటి,
మలమూలి నల్వ వేమలగాడు ప్రోయాలు,
లేముల నెడబాపు చామ మిన్న,

గీ॥ కడలి రేనికి కూతురౌ కమల నురము
నందు ధరియించి మెప్పొంది యలరితౌర!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ పుట్ట బుట్టినవాని, మెట్ట బుట్టినవాని,
గొనియాడి, కాళిని గొల్చువాని,
బాళిమీర నుతించి, భారతామ్నాయము
భాగవతమ్ము, రామాయణమ్ము,
తెలుగుబాస యొనర్చి, తేజరిల్లినవారి
యడుగుల కెరగి, యద్యతన కవుల
కతిభక్తి మోడ్పుగే లొదల గీలించి,
సుకవుల పేర్మికి జోకదెచ్చు,
గీ॥ సుకవి జనులను గొలియాడ గూడకున్నె,
యనుచు దలపోసి యాక్రియ ననుసరింతు!
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ ప్రాచేతసవ్యాస భట్టారకుల గొల్చి,
కాళిదాసుని భక్తి గణుతిజేసి,
భారవి మాఘు మయూరు దండుల నెంచి,
భక్తి పోతనకవి బ్రస్తుతించి,
యన్నయ భాస్కర యజ్వనార్యుల నెంచి,
యోజ దిక్కన సోమయాజి నెంచి,
శ్రీనాథ సోముల చింతించి, యద్యత
న కవుల కతిభక్తి నతియొనర్చి,
గీ॥ శ్రీధరాచ్యుత గోవింద సీస శతక
మొకటి నీకర్పితము సేయ నూహగలిగె!
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ సంస్కృతాంధ్ర శ్లేష శబ్దార్థ గౌరవ
వృత్తి శయ్యాగుణ రీతు లెరుగ,
ప్రాస విశ్రమ గణ ప్రత్యయ ప్రస్తార
భావ నిరూపణ ప్రౌఢి నేర,
నాటకాలంకార చాటు కావ్య పురాణ
శాస్త్రంబు లెవ్వియు జదువ లేదు,
శతకంబు తావక చరణార్పితంబుగా
విరచనా కౌతుక వృత్తి వెలయు

గీ॥ నట్టి నను కృశ ధిషణు నన న్య సులభ
దయను గని దీని దుదిముట్ట దలపుమయ్య!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ నిరయమార్గ నిరోధ వర పదార్థ శ్రావ్య
భవ్య కావ్యోదారు భాష్యకారు
నిఖిలాగమాంతార్థ నిర్ణిద్ర బోధావి
తాపన్న జనగేయు యామునేయు
ప్రథిత విజ్ఞాన వైరాగ్య భక్తి విశేష
నందిత శ్రీజాని నాథమౌని
సదసదీశ్వర తత్వ సదుపాయ దర్శన
రక్షితాచార్య పరాశరార్యు

గీ॥ దలతు, నుతియింతు సేవింతు, తగ భజింతు
శ్రీ సమగ్రత్వ నిరపాయ సిద్ధి కొరకు
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జనపాల! మదన గోపాల బాల!

సీ॥ పూధత్త కూరత్త పొయిఖ తిరుప్పాణి
తిరుముడి శకుల శేఖర శఠారి
మధుర పెరియ తిరుమంకేయ తొండర
డిప్పొడి పెయ్యాళ్వా రప్పలను స
భక్తి చిత్తంబున భజియించి నిరతంబు
తంత్ర సర్వస్వ స్వతంత్ర ధీరు
దైత్యారి ఘంటావతారు వేదాంత దే
శికవర్యు పద సరసీరుహములు
గీ॥ మామకీన హృదంభోజ మధ్యమందు
నిలిపి సేవింతు భక్తినిర్నిద్ర మతిని,
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ కౌస్తుభ మణిహార! ఘనసన్నిభ శరీర!
దుష్టపాల కుఠార! దురితదూర!
మందారు మందార! వననిధి గంభీర!
సూరిజనాధార! మేరుధీర!
సుగుణగుణోద్ధార! సురవార పరివార!
విశ్వ విశ్వాకార! వేదసార!
నంద గోప కుమార! నవనీత దధిచోర!
గోవర్ధనోద్ధార, గురువిహార!
గీ॥ ఘోర సంసార పర్వత కులిశధార!
కాంచనాంబర శుభక రాకార ధీర!
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ పాణిసంగ రథాంగ! పరభయద శతాంగ!
మామనోంబుజ భృంగ! మధు సుసంగ!
కరుణా రసాపాంగ! ఘనరమా కలితాంగ!
తల్పీకృత భుజంగ! తత్వ రంగ!
రంగ దుత్తుంగ విహంగ నాథ తురంగ!
పాద సంభవ గంగ! పాప భంగ!
శ్రిత జనావన భంగ! శ్రీవత్స ఘనలింగ!
పోషిత మాతంగ! తోషితాంగ!

గీ॥ అచలితాపార కరుణా రసాంత రంగ!
మత్త దితి సుత గర్వ తమః పతంగ!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ అమర నాయక మేష! హాయ ముఖరాశేష!
సురసంఘు పరితోష! చిర విశేష!
కౌస్తుభ మణిభూష! గంభీర మృదుభాష!
శ్రితజన పోష! సంచిత విశేష!
కమలాసతీ తోష! గాఢ తరాశ్లేష!
పరిహృతానతరోష! పాదదోష!
దైత్య హృద్విద్వేష! దారిత మునిశోష!
గుప్త శక్రజ మోష! గోపవేష!

గీ॥ కుధర భరణ సంరక్షిత గోపఘోష!
ఆర్త జనతాభిరక్షణ తాభిలాష!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ దండంబు కుండల మండన మండిత
గండ మండల కాంతి కాంతతుండ!
దండంబు బ్రహ్మాండ తండోప తండక
భాండ పిచండ విభాండ కుక్షు!
దండంబు భండనోద్దండ పండామహా
దండజాఖండలాఖండ కాండ!
దండంబు కుండలితాఖండ కోదండ
దండ హిండిత కాండ దళిత దైత్య!
గీ॥ దండ ముద్దండ తాండవ దండి తాహి
శౌండ వేదండ రక్షణా చండ కేశ!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ నీల నీరద గాత్ర! నిర్జర నుతిపాత్ర!
పాప లతాదాత్ర! పద్మ నేత్ర!
దుష్ట కంద ఖనిత్ర! దుస్సహా సుర జైత్ర!
పావన చారిత్ర! పతగ పత్ర!
భవ విమోచన సూత్ర! పాలిత మునిపుత్ర!
కువలయావనచిత్ర! పవన పాత్ర!
సాందీపక చ్ఛాత్ర! సమ్యగుద్ధుతగోత్ర!
భక్తాఘ వనచైత్ర! పరమ మిత్ర!
గీ॥ ఆప దర్ణవ తర ణైక యానపాత్ర!
కంధి గర్వ విదారణ కంకపత్ర!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ దండ మండజ వాహా! దానేప్సితార్ణ సం
భాన విజ్ఞ కటాక్ష దనుజ శిక్ష!
దండ మండజ వాహా! తాతమస్త్రావగ
జనక కోమల పాద! శమితఖేద!
దండ మండజ వాహా దరసుగానామోద
భక్త రక్షణ లోల! భవ్యశీల!
దండ మండజ వాహా! దశకోటి లావణ్య
భరిత శుభాకార! దురితదూర!
గీ॥ దండ ముద్దండ భండన పండితేంద్ర!
విద్విషత్ఖండనా ఖండవీర్య కాండ!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజన పాల! మదన గోపాల బాల!

సీ॥ భక్తౌఘ నిరపాయ పాలిత కౌంతేయ,
ధృత, పీత కౌశేయ, సత విధేయ!
నిర్జిత దైతేయ, నీల నీరద కాయ,
వినమిత మైత్రేయ, విశ్వ గేయ!
యోగీంద్ర సముపాయ, యోగి సమున్నేయ,
విశ్వ జనధ్యేయ. విదిత మాయ!
కైవల్య సముపాయ, కరుణారసామేయ,
నిగమాంత విజ్ఞేయ, నిహత హేయ!
గీ॥ పరమ పదమార్గ పాథేయ, భాగధేయ,
వితత విరజానదీక్షేయ, విశ్రుతాయ!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జనపాల! మదన గోపాల బాల!

సీ॥ గోపాంగనాభీక గుప్త కుంతీతోక,
సచ్చిత్త నాళీక, చంచరీక,
దీనావనచ్ఛేక, దితితనూజోలూక,
పంకజాప్తాలోక, భరిత లోక,
పాలిత గురుపోక, భక్త గీతశ్లోక,
గోరక్షణోద్రేక, గురు వివేక!
చిర కరుణాస్తోక, సేవమాన శమీక,
దయనీయ సురలోక ధారితాక,
గీ॥ అంఘ్రి సరసీరుహాన మధ్యాయ జూక,
నామ జపవీక్షణాన ర్వానరక లోక,
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ పద్మ సంభవ భవప్రముఖ గీర్వాణులు
జయజయేతి ధ్వని సన్నుతింప,
నారద సనక సనందనాదులు ముకు
ళిత వర కములు లై నతి యొనర్ప,
కిన్నర గంధర్వ కింపురు షాదులు
తవిలి మోదమున గీతములు పాడ,
హారిణీ తిలోత్తమాద్యప్సరో రమణులు
చతురత నటనంబు సల్పుచుండ,
గీ॥ వసుమతీ భార ముడుప దేవకికి బుడుత
వసువునను పుట్టి నాకారవన్న మీర!
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ కావలి వారల కన్నులు పొరగప్ప
వసుదేవు సంకెలల్ వదలి పోవ,
ఘన కవాటంబులు కడిది తాళములూడ,
నదుల నీరములు కాల్నడగ బార
ఘనమాయ యొదవించి కంస దానవ భీతి
వలనొప్ప మందకు నలస బోయి,
పొలుపొంద నందుని పొలతుక పొదిగిట
పసిబిడ్డవై నీవు పవ్వళించి,
గీ॥ పెరిగితివి నాటి నాటికి పేర్మిమీర
పరగ పడరాని బదవల బడితివయ్యా,
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల! 20

సీ॥ చిన్ని క్రొన్నెల వన్నె నెన్ను నెన్నుదురున
తిన్నని కస్తూరి తిలక మమర,
యురమున కట్టాణి హురుమంజి ముత్యాల
సరుల నిద్దానిగ్గు చౌకలింప,
పదములు పచ్చరాపలకల బొంగారు
బంగారు రవల పావడ జెలంగ,
గొల్లపిల్లల తోడగూడి కోడెల హెళి
జాతట భూముల మేతమేపు,
గీ॥ నీ వయారంబు నీ సొరు నీ చొకార
మహహా! వ్రాక్రువ్వ నలవియే యజునకైన?
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ భానుకోటి ప్రభాభాసమాన ద్యుతి
విలసిత మకుట మాదల జెలంగ,
సుప్రసన్న స్మిత సుందర వదనార
విందంబు చందురు నందమంద!
జిలుగు క్రొంబసిండి దువ్వాలువ పై జెన్నొందఁ
కరుణారసము కడకండ్ల జింద,
మకర కుండల హార మంజీర కేయూర
కంకణ మేఖలల్ కల్కు లీన
గీ॥ దేవకీదేవికిని వసుదేవునకును
నిట్లు పొడచూపితౌర హా! యింపుమీర!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ వీనుల నమృతంపు సోనల పొంగైన
యరిది వేణుధ్వని యాలకించి,
మామల నత్తల మరదుల బావల
తల్లిదండ్రుల సహోదరుల వరుల,
వీడి వాడల నున్న చేడెలు గమిఁగూడి,
నడురేయి రా వారి నగుచు గాంచి,
సుద్దుల ముద్దుల సొక్కుల పెక్కుల,
నాటల పాటల కూటములను,
గీ॥ అతుల గతులగు రతులను సతుల దేల్చి,
వెతల జెందించితివి వారి వేడ్క గోరి!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ పెరుగు లమ్మెడు గొల్ల నెరహొంతకారుల
 మొదల పై బొదలు పయ్యెదలు బట్టి,
చెక్కులు ముద్దాడ జిగిచన్ను గవ బట్టి
 యలతి కెమ్మోవుల యమృతమాని
జిగిబిగి కౌఁగిట జిక్కన గదియించి,
 బాళిమీఁరగ రతి కేళి దేల్చి,
గప్పాచిప్పాగ నౌరుల్ గనకుండ దరిజేరి,
 చిడిముడి నడితప్పటడుగు లిడుచు,
గీ॥ గోలతన మచ్చువడ తల్లి మ్రోల జాల
క్రీడ లొనరించు నీ మాయ జూడ వశమె!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ గిల్పతాణికిటికీబారు పైఠాణి
 పాగపై పచ్చరాపస తురాయి,
చెంప గీలించి వజ్రంపు కళుకులసరి
 షేషుహాయ ధరించి బెళుకు తళుకు,
గీనాకబు నిలువు టంగీబూని నెరఘుకీ
 నిగ్గు మొగ్గల కుడ్తినీయిజారు
గడి మొఖమల్ దట్టి నడకట్టుగా గట్టి
 పసిడి వాఫరుజుడాబాను వైచి,
గీ॥ తేట నడలయుడాన్బాజి తేజి నెక్కి,
వెడలు నీ సొరు గనుచుండు వెలది పిండు,
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జనపాల! మదన గోపాల బాల!

సీ॥ అరజారు కురుల జెన్నారు నెన్నుదురున
రావిరేక బెడంగు రంగుమీర,
ముక్కున హొంరుమంజి ముత్యంబు తెలిడాలు
చిరునవ్వు సొబగుతో చెల్మిచేయ,
పసమీరు పక్కరా పత్సల పులిగోరు
పతకంబు బొజ్జపై పరిఢవిల్ల,
మొలనున్న మవ్వంపు మువ్వల మొలనూలు
కళ్ళు-లు నల్లపల్ గడలు కొనగ,
గీ॥ వాడవాడల చేడెల తోడగూడి,
క్రీడ లొనరించు నీ హొయల్ జూడదరమె?
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ మనచిన్ని కృష్ణుండు మన్ను దిన్నాడంచు
బలుడు యశోదతో బల్క నల్క
నా కులదీపక! నా పుణ్యముల ప్రోక!
నా తపఃఫలరూప నన్ను గన్న
తండ్రి! మన్ను దినంగ దగునయ్య! మనయింట
దగిన పదార్థముల్ దనువ లేవె?
యన్న, కల్లరియన్న! మిన్నక నన్నిటు
లారడి జేసె నా నోరు జూడు
గీ॥ మంచు జూపిన భువనము లందుగాంచె
దనర నీతల్లి, నారీమతల్లి, తొల్లి!
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ తొగల సంగడికాని నగునగు మొగముతో
వగగుల్కు నపరంజి వల్వతోడ,
తలిరు నిద్దాకెంపు తరితీపి మోవితో
తలనెమ్మి నునుపురి దండతోడ,
పెదవిపై జేర్చిన పిల్లన గ్రోవితో
నునుకురు లొలయు నెన్నొసలి తోడ,
రతనాల మురిడీల రవణాల కేలితో
మిసమిస లెసగు నెమ్మేని తోడ
గీ॥ పొదల మాటున డాగుచు పొంచి గొల్ల
చానలకు నీవు పొడజూపు చంద మెంత?
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ శారద సంపూర్ణ చంద్ర చంద్రాతప
విమల బృందావన వీధులందు,
మాకంద చందన మందార తిందుక
ఘనసార శోభిత వనములందు,
రంగదుత్తుంగ తరంగ శీకర శీత
సైకత వేదికా స్థలములందు,
నేలాలతా జాల లోలావిమాలతీ
వల్లికా మల్లికా వాటికలను,
గీ॥ కులుకు పరువంపు ప్రాయంపు గొల్ల చెలుల
గలసి విహరించు నీ హొయల్ గణుతి జేతు!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జనపాల! మదన గోపాల బాల!

సీ॥ విరిసిన తొగ తెగవేడి వేలుపు పట్టి
వెల్లిపై విలసిల్లి వెలసె ననగ,
మగరాల నిగరాల జిగిదగు శశిపువ్వు
మొవ్వంపు క్రొవ్వాద నివ్వటిల్ల,
జక్కవ కవవల జెక్కిన కైవడి
గుల్కు పయ్యెద లోన గుబ్బలలర,
నచ్చర విరిబోండ్ల మెచ్చని రూపున
గంద మలందిన కంసదాసి,
గీ॥ గలసి వలరేని వెలలేని కలన బెనగి,
మనుచు నీవైన దయపేర్మి వినుతిజేతు!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ బ్రహ్మాదులకు గానబడని బ్రహ్మం బెన్న
పసిగాపు పిల్లడై పరిఢవిల్లె,
వేద వేదాంతముల్ వెదకి కానగగాని
ఘనుడు వ్రేతల రోట గట్టు వడియె,
విశ్వగర్భుండన వెలయు దేవుడు యశో
దాదేవి పొదిగిట దనరియుండె,
అసురుల వంచించి యమృత మమరుల కి
చ్చు శుభుండు నవనీత చోరుడయ్యె,
గీ॥ నహహా! యని నిన్ను యోగీంద్రు లభినుతింప,
బెంపుమీరితివౌర! యీ పృథివియందు!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ వీకమై వ్రేపల్లె వైకుంఠ నగరమా!
కమల బాంధవ సుత గనగ విరజ?
మాయూర పింఛము మణిమయ మకుటమా!
గురివింద పూసలు కుండలముల?
ఆభీర సుందరు లప్సరో యువతులా!
పరగ బృందావని పరమ పదమ?
నంద గోపాలుల బృంద మాళ్వారులా!
తగగ పిల్లన గ్రోవి దరమ యహాహా!

గీ॥ తృణము మేరువు మేరువు తృణము జేయు
నీ యఘటనా ఘటన శక్తి నియతి గాక!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ నెలతల కిరుదెస నీవును నెలతలు
నీ కిరు దెసలందు నెగడు చుండ,
మండల మొనరించి మధ్య భాగంబున
మోహనమూర్తివై మురళి బూని
చేతనాచేతన వ్రాత సమేతాంబు
జాతజాండము లేక రీతి జొక్క—
నానంద సాగర లీనలీ నాభీర
నలినాననామణీ సటనములకు

గీ॥ తగ నొనర్చితి బ్రహ్మ గాంధర్వ గీత
రసవిసర మోలి బ్రసరించు రాస కేలి
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జనపాల! మదన గోపాల బాల!

సీ॥ శ్రీరమా మణికిని చిత్త మీయని నీవు
గొల్లమిత్తారుల గూడినావు!
సనకాది యోగి సంచయము గానని నీవు
మందగొల్లలతోడ మసలినావు!
ఉపనిషద్విషయత్వ మొందియుండని నీవు
దూడల మేపంగ దొడగినావు!
క్షీరాబ్ధి కొలకుల జిందులాడెడి నీవు
పాలు దొంగిలిపట్టు బారి తహహా!
గీ॥ గోపికా స్త్రీల పుణ్యమో గోపబాల!
భాగధేయమొ నందుని భాగ్య గరిమొ!
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ ఎవ్వని చేతను నీ వేదములు నాల్గు
నీ శాస్త్రషట్కంబు నీ పురాణ
గణమును దీనరక్షాది నామంబులు
గల్పింపఁబడియె నా ఘనుడు సత్యు
డగునేని దీనుల నరయుట దప్పదు
నీకిది నిజమని నిశ్చయించి,
రక్షించు గాకున్న రక్షించ హేతువు
లేదని మొగమోటు లేక చెప్పుము!
గీ॥ వదలమని మోము పదముల గదియ నీవు
బరసి సంపుల దూరను భాగ్యమేమి?
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ వేద శాస్త్ర పురాణ వివిధేతి హాసముల్
భక్త దీనాపన్న బాంధవాది,
నామంబు లెవ్వడు నయగతి బుట్టించె
నామహామహుడు సత్యాత్ముడేని,
వీరుల రక్షింప విధి నీకు తప్పదు
గాకున్న బాధ్యత గల్గబోదు!
గాన విచారించి కరమొప్ప జెప్పుము,
నీకక్కరా సరే లేక యున్న,
గీ॥ మాకు గావగు కర్మంబు మా కనుభవ
మాయె ననియూరకేయుందు మయ్య తలచి!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ ఆర్త శరణ్యుండ వనియును దీన ర
క్షకుడ వనియు భక్త కాముడ వ
నియు తదర్థాన్వర్థ నియతి దంతి హిరణ్యా
కశిపుసూను గుచేలు గాచితనియు,
శ్రుతులు శాస్త్రంబులు స్మృతులు పురాణముల్
జెప్ప నట్టడవిని జేరి నమ్మి
కొల్వగా సవిజేయ కుంట సరే గదా
సతము జేసితివి దుర్జనుల బాధ
గీ॥ తివిరి నీ బిచ్చములపేరు దేవు డెరుగు
కుక్కలను బిల్వ మను మాట నిక్కమాయె:
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ మేషాండ మిదెపశు మొసవృము ననుగోర్కె
నమ్మి వెంటాడెడు నక్క మాడ్కి
బూరగ పువ్వాస బొంది చూచి విశేష
పరకాంక్ష గనిపెట్టు చిలుక భంగి
తరిమీర యురుముల దగు మొగుల్గమి గని
కలము వి త్తెడు కృషీవలుని పగిది
కాడని తెరువరి కానగానకనిప్పు
కొరవి దయ్యము జేర గోరు పోల్కె
గీ॥ సంపదున్మత్త బధిరాంచ సరణి బరగు
మూఢ విభుసేవ సుజనుల మోసపుచ్చు!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జనపాల! మదన గోపాల బాల!

సీ॥ కదన కర్మఠ గజ కమఠ కఠోరోగ్ర
కాయ విభేదన కారణములు,
దేవతా నాథ నిధేశ సుధాతాండ
రక్షణ నిపుణ విద్రావణములు
కుక్షి సింధు స్థాయి ఘోర నిషాదాళి
నిగరణోదీరణ నిర్ణయములు
స్ఫటికమాని నిషేవ్య వటశాఖి శాఖికా
నిర్భర గ్రహణ నిర్నిద్రితములు
గీ॥ నైన త్రోటీపుటంబుల నలరు విహగ
పుంగవుని వాహనంబుగ బొందితౌర!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ పూసల దారంబు పొసగిన కైవడి,
విరులతో వాసన వెలసినట్లు,
పాల లోపల నెయ్యి బరిగిన పోలికె
కాష్టమందున నగ్ని గలుగుకరణి,
కోకను నూలున్న జోకను, చెరుకున
తీపి గల్గిన రీతి, తిలలు నూనె,
యున్న చందంబున, మిన్నున శబ్దంబు
నలరినగతి, మేఘమందు మెరుగు
గీ॥ దనరు భాతిని, యణురూప ధారి వగుచు
సకలమందున నుందువు సహజరీతి!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజన పాల! మదన గోపాల బాల! 40

సీ॥ కలిగొట్లచెట్ల చెంగట చల్వ చెంగావి
వలపు గొజ్జగిసీటి వంత చెంత,
పూచిన నునుపోక బోదెల బ్రోదిమై
నల్లిబెల్లిగ నల్లు మల్లెతీవ,
పందిళ్ళ నంటిన పరువంపు మరువాపు
దళ్ళసోరణ గళ్ళ వరుల పచ్చ
కప్రంపు టనటుల కంబాల క్రేవల
తీరైన నెలకాంత తీనెలందు
గీ॥ వేసవుల రుక్మిణిని గూడి వేడ్క నలుపు
సాకు వేవేల విధముల సన్నుతింతు,
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ పులిహోర శర్కర పొంగలి బూరివిశం
గాయదధ్యోదన పాయసములు,
భక్ష్య భోజ్యంబులు బహులేహ్య చోష్యముల్
పానీయ ఫలములు తేనెలూను,
అరువది యారవ సరములు భుజియించి
బహుభోగివై నీవు పవ్వళించి,
పట్టెడన్నము మాకు బెట్టు జగన్నాథ!
యని భక్తజనులార్వ వినవు కనవు,
గీ॥ పేరు దెలియక బెట్టిరె పెద్దలెల్ల
శుద్ధ బుద్ధావతారమన్ సూక్తి బట్టి,
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ పీనుల కిసుమంత దీనంట నీయక
దుర్జనుల న్యాయద్యూతచౌర్య
సత్యేతరంబుల సంపద లార్జింప
నాపైని నీవు సహాయమమర,
మందిర ధనధాన్య సుందరీ బహుమిత్ర
పుత్ర కళత్ర విస్ఫూర్తి నిత్తు
వేమి ఫలంబెన్న నెండిన పైరుల
పైనొక చినుకైన బడక యుండ
గీ॥ వారిదమువంత వాగుల వరద వాన
కాలువల నేరులను ముంచు కరణసిబ్ధి!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ కోటలు కొమ్మలు కోవెలల్ మాళిగల్
గోపురంబులు మణికుట్టిమములు,
కాంచన ధ్వజములు కనక విమానముల్
మణితోరణమ్ములు మంటపములు,
కరి హరి రథ పుష్పకాందోళికా కర
దీప సహస్రముల్ దివ్యశంఖ
పటహా ముఖ్యరవంబు భక్త గాన రవంబు
వైష్ణవోత్తమ సామవర రవంబు
గీ॥ భోరు కొలువంగ నుభయ కావేరి యందు
రంగ భూపతి యనగ జెలంగి తౌర!
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ అదితి చన్నుల పాల నారగించగ గదా
కొంచక బలిని యాచించినావు!
కోసలాత్మజ పాల గ్రోలియుండగ గదా
దురమున రావణు దున్మినావు!
అల యశోదా స్తన్య మానియుండగ గదా
కానలో పసులను గాచినావు!
పూతన విసపుపాల్ పూని ద్రావగగదా
మాపట్ల కఠినంబు జూపినావు!
గీ॥ పాల గుణమంచు మదినెంచ బడునుగాని,
నిన్ను నెపపెట్ట పనివేరె యున్నదయ్య!
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ అమ్మ పాలిమ్మని యడుగ ద్రచ్చుట మాని
ముద్దాడి చెక్కుల మోము నిమిరి,
పాలిచ్చు తరి గ్రాగు పాల్పొంగ చల్లార్ప
జనయిత్రి జన నీవు జరిగి పెరుగు
కుండబో నడుమంగ కోపించి వెన్నాడి
పట్టి త్రాటను రోట గట్టిపెట్ట,
నీటు కాటుక రేక నిగనిగ తెలిగుల్కు
కన్గవ బాష్పముల్ గ్రమ్మ కొనగ,
గీ॥ మొగము కరమున ద్రాముచు వగల రోలు
గూర్చి నందున మద్దుల గూల్చితౌర!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ ప్రహ్లాదు డేపాటి పారితోషిక మిచ్చె?
కరిరాజు నీకేమి కట్న మిచ్చె?
వెస విభీషణుడెంత విత్తంబు నీకిచ్చె?
ద్రౌపది నీకేమి ద్రవ్యమిచ్చె?
పుండరీకుండేమి భూషణంబు లొసంగె?
నారదుండేమేమి నగలు బంపె?
అంబరీషుడు రత్నహారమ్ము లెన్నిచ్చె?
గంగాత్మజుండెంత కనక మిచ్చె?
గీ॥ నేను నీకేమి దర్శింప నేర్పనైతి!
నన్ను పేక్షింప నీకేమి న్యాయమయ్య!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

# మదన గోపాల శతకము

సీ॥ కృష్ణ! రామానుజ! కేశవ! యని నిన్ను
పలుమారు బిలచిన పలుకరాద!
చిన్నవాడవు తండ్రి సిరులేమి యడుగను,
ముక్కు ముత్యము కట్టి మురళిమూహు,
గలవంకు ముత్యంబు గనువేక్క నడుగను,
గోర వేణువు నేను నేరనూద,
కట్టి వేడను దూడ కదుపులు లేవున్న
గాయనోపను దయాకలిత దృష్టి

గీ॥ నోటి మాటల కైనను నోచలేదె?
భాగ్య మడగను నమ్మి నీపాదమాన!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

॥సీ వందన మరవింద వాసినీ హృదయార
విందమ మరంద మిళిందనీకు!
వందనమాత్మభూ వాసవప్రముఖ సు
పర్వ వందిత పదపద్మనీకు!
వందన మిందు భృగ్వరవర్ణ! స్త్రీవ్రత
జప నియమాంచిత చరిత నీకు!
వందన మాపన్న వరదాన దీక్షాప్ర
వీణ వీక్షణ రుచివిభవ నీకు!

గీ॥ వందనం బానమజ్జన వరద నీకు!
వందనం బిద్ధకౌస్తుభ వత్స నీకు!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జనపాల! మదన గోపాల బాల!

సీ॥ పేరోలగంబున విదుర శారద్వత
సురనదీసంభవ సోమదత్త
బాహ్లీక కుంభజ ప్రముఖులు గొల్వంగ
గొల్వుండి కురురాజు కుత్సితమున,
ద్రౌపది నేకవస్త్రను రజస్వలను ర
ప్పించి వల్వలు విడిపింప బంప,
దత్తర పాటున దవ్వుల నున్న ని
న్గోవింద !కృష్ణ! ముకుంద! కావు
గీ॥ మంచు బలవించ దయ నక్షయాంశుకముల!
మానినీమణి మదిగుందు మాన్పి తౌర!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జనపాల! మదన గోపాల బాల!

సీ॥ వైకుంఠ మందిర వర కవాటద్వార
భేదనంబులు సుఖాపాదనములు!
స్థిరతరానన్య భక్తిసమేత దీన నం
జీవనములు జగత్పావనములు!
దాస లోకమనోరథానుసంధాన వి
చక్షణంబులు భక్తరక్షణములు!
ఘోర సూర కుమార పీర కింకర వార
భీకరంబులు జనశ్రీకరములు!
గీ॥ అయిన నీనామ కీర్తన లస్మదీయ
జిహ్వా కనువొంద జేయవే శేష శయన!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ నీ తనూజాతుడు నిఖిల జగత్సర్గ
సంధాన విద్యా విచక్షణుండు!
నీ దార దారిద్ర్య నీరధి నిర్మగ్న
నర సముత్తారణ తరికటాక్ష!
నీ సుత భవపాశ నిర్మోచ నోదార
వరలవిత్రాయిత వారిపూర
నీ కోడ లజ్ఞాన నిబిడతమోమగ్న
మానసత్రాణాయమాన కరుణ!
గీ॥ భక్తులకు భుక్తి ముక్తులు యుక్తి నొసగి,
నీ కుటుంబమె జన్నక నిన్ను గొల్తు!
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ సురుచిర శ్రీపద తరుణారుణద్యుతి,
వంచిత వికసిత వారిజములు!
బలభేది శుచి యమ ప్రముఖ దిక్పతిపురీ
మా రమణీమణీ మండితములు!
సేవక సముదాయ చింతితాభీష్టార్థ
సర్వస్వ ఘటనా విశారదములు!
ఆన మజ్జన మాన నాంధకార నిరాస
విజ్ఞానికర్తన విలసనములు!
గీ॥ దీనజన కల్పకము లన దేజరిల్లు,
నీ పదంబులు నా మది నిలుపుమయ్యా!
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ నీలతనుద్యుతి నిర్జిత నారద
 నారద గానాభినందితాత్మ!
వైవస్వతావనావతరణ రాజీవ
 రాజీవ సంభవార్వ్వాణ పదాబ్జ!
ఆనమజ్జన మహాదాపన్నివారణ
 వారణాంతి ధ్వాంత వారిజాప్త!
కరుణాకటాక్ష వీక్షణ గుప్త గోరాజ
 గోరాజ గమనుత గుణకదంబ!

గీ॥ శయ సముంచిత నందక శంఖచక్ర
చక్రమరుదాశరప్రాణ శైలకులిశ!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ జయ విజయీభవ! శతమఖ సుతమిత్ర
 జయ విజయీభవ! జలజనేత్ర!
జయ విజయీభవ! స్మరకోటి లావణ్య!
 జయ విజయీభవ! జనితపుణ్య!
జయ విజయీభవ! జలధర సమదేహ!
 జయ విజయీభవ! శమితమోహ!
జయ విజయీభవ! శాంత తాపస పోష!
 జయ విజయీభవ! సత్యభామ!

గీ॥ యని వినతి నీ కొనర్చెద ననుదినంబు,
చటుల భవదవతాప ప్రశాంతి కొఱకు!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

||సీ మాధవ సుదర్శనా మధుసూదన నోపేంద్ర
సామజ వరద భుజంగ శయన!
పుండరీక దళాక్ష! పుణ్య సుబ్రహ్మణ్య!
దామోదరాచ్యుత! దానవారి!
కౌమోదకీ ధర కౌస్తుభ భూషణ!
దేవకీ నందన! దేవ దేవ!
చక్రి! చతుర్భుజ! శాంత జనార్దన!
శరణ విష్వక్సేన శాశ్వతేశ!
గీ|| కాల నాభ గదాగ్రజ కామజనక!
శ్రీశ! శ్రీధర! యని నిన్ను చింత జేతు!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ|| వేదాంత సౌధాంత విహరణ బర్హిణ
నిర్మల చారిత్ర నీకు శరణు!
గగనధునీ జనకాంఘ్రి పయోరుహా
నీరజ లోచన నీకు శరణు!
మునిజన మానస వనరుహా భాస్కర
నీలకంఠ ప్రియ నీకు శరణు!
తాపత్రయాభీల దావపావక మేఘ
నిత్య నిత్యానంద నీకు శరణు!
గీ|| శరణు శరణని నిన్ననిశంబు భక్తి
జేరి సేవింతు, నిందిరా చిత్త చోర!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జనపాల! మదన గోపాల బాల!

సీ॥ పాప లతా దాత్ర పావనచారిత్ర!
కమనీయగాత్ర! మంగళము నీకు!
కరుణాకర సోదార! కామిత మందార!
కమలా విహార! మంగళము నీకు!
ముని మనోంబుజభృంగ! మురదైత్య మదభంగ!
ఖగరాట్తురంగ! మంగళము నీకు!
భోగి నాయక తల్ప! యోగి నాయక కల్ప!
కౌస్తుభాకల్ప! మంగళము నీకు!
గీ॥ ఘన విపత్తిమిరార్క! మంగళము నీకు!
కామ కామిత రూప! మంగళము నీకు!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ ఓ ధృత భూధర! యో హిత శ్రీధర!
యో నిగమాగణ్య! యో శరణ్య!
యో ధర్మరక్షక! యో దైత్య శిక్షక!
యో పాప వనదావ! యో సుభావ!
యో పుండరీకాక్ష! యో పుణ్య జనరక్ష!
యో పాద భవగంగ! యో శుభాంగ!
యో మౌని జనగేయ! యో సుపర్వాధ్యేయ!
యో సవనాధార! యో సుధీర!
గీ॥ కరుణ జూడవె ఘనదయ గనవె వినవె!
రావె, రక్షింపవే, రమా రమణ! లేవె!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ గోవు దూడకు పాలు గోర్కె నిచ్చి వృకాది
బాధలేకుండ గాపాడు భంగి,
పుత్ర మిత్ర కళత్ర భోగ భాగ్యంబులు
భక్తుల కొసగియు పరమపదము
దయసేయవలె నిది ధర్మ మార్గంబెన్న,
శ్రేయములకు నంతరాయమైన,
కోర్కెలు నెవరుగ కోరిన నెరిగిన
నీ వీయ దలచుట నేరమయ్యా!
గీ॥ విషము గని కూన తండ్రిని వేడినంత
నడిగినాడని విషమీయ గడగునయ్యా?
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల! 60

సీ॥ ఓ భోగి రాట్తల్ప! యో యోగి రాట్కల్ప!
యో సత్య సంకల్ప! యో యనల్ప!
యో నిభృతానంద. యో నందిత సునంద!
యో నమన్ముచికుంద! యో ముకుంద!
యో విజయోత్కంఠ! యో శ్రిత వైకుంఠ!
యో వల్లవీమింఠ! యో వికుంఠ!
యో ఖగరాడ్వాహ! యో ఘనాఘనదేహ!
యో చక్రధర బాహ! యో విమోహ!
గీ॥ యో నత పురారి! యో శౌరి! యో మురారి!
రావె, రక్షింపవే, రమా రమణ నన్ను!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ జయ కమలానాథ! జయ జితాసుర యూథ!
జయ సజ్జనసనాథ! భయ విరోధ!
జయ పయోధరగాత్ర! జయ పశుపతిమిత్ర!
జయ దేవతావృత! సంఘు చైత్ర!
జయ మునిహృద్గేహ! జయ విహంగమవాహ!
జయ రుచిరాంగ! దాజానుబాహ!
జయ సురేంద్ర శరణ్యా! జయ నిగమాగణ్యా!
జయ నామ కీర్తనా జనిత పుణ్యా!
గీ॥ జయ గదా శంఖ చక్రాశి చారు హస్త!
జయ లసద్రత్న మకుట విశాల మస్త!
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ అపరాధి నపరాధి నాశ్రిత జనరక్ష!
యపరాధి నపరాధి నంబు జాక్ష!
యపరాధి నపరాధి నమరవనీ చైత్ర!
యపరాధి నపరాధి నసుర జైత్ర!
యపరాధి నపరాధి నానత జనపోష!
యపరాధి నపరాధి నమృత భాష!
యపరాధి నపరాధి నబ్ధిరా డ్గంభీర!
యపరాధి నపరాధి నత్యుదార!
గీ॥ పుట్టినప్పటినుండి నే పుణ్యమేమి
జేయ నపరాధి యని చెప్పి చేరినాడ!
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ బాలుడవే శయ్య బవళించి గురువెట్టి
నిదుర బోవుచు నున్న నిన్ను జేరి,
పూతన యచ్చర పూబోడి పోడిమి
ముద్దాడి చెక్కిలి మోము నిమిరి,
పాలిత్తు నా చిన్ని పాపడ లెమ్మన,
వించు మెల్లన నావలించి నీల్గి,
చన్మోన నోటను సంధించి విషదుగ్ధ
రక్త మాంస ప్రాణ శక్తులూని,
గీ॥ గ్రుక్కుకొని రక్కసిసి నేల గూల్చి మీద
నెక్కి యాడెదు నీ లీల లెన్న దరమె?
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ దాన ధర్మ వ్రతాధ్వరములు జేసిన
మొనసి కీర్తియె కాని ముక్తిలేదు,
తీర్థాల వెంబడి తిరుగ వప్పర్మల
మోచనంబే కాని ముక్తి లేదు,
దండ కాషాయ కమండలములు పూన
మొగి దంభమేకాని ముక్తి లేదు,
పంచముద్రలు బట్టి బహుగాసి నొందిన
పొగడొందుటే కాని ముక్తి లేదు,
గీ॥ నిత్య నిరుపమ నిశ్చల సత్య సౌఖ్య
పదవి గనునె భవత్పద భక్తిలేక?
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ సుతుల సహస్రముల్ సతుల సహస్రముల్
నెక్కొన ద్వారక పిక్కటిల్లి,
కరి హరి నర రథ కాంచన ప్రాకార
సౌధయానాసన శయ్యలెసగ,
భోగివై సంసారి పోలుపున వర్తిల్లి
కంస మాగధ ముఖ ఖలుల నణచి,
కౌరవ సేనల గడతేర్చి యడవుల
నాశన మొనరించి నగర మబ్ధి
గీ॥ ముంచి భూభర ముడిపి దీపించి బ్రహ్మ
గారుడంబాడితౌర! విఖ్యాతిమీర!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ రాజీవ మకరంద రసమాను తుమ్మెద
జరుగునె గ్రోలని తురకమునకు,
సహకార కెసలయు జగ్ధిగల్గు పికంబు
జోకమై జనునె కింపాకమునకు,
మానస సారస మార్తికోదనహంస
గోరునే జనచాట గోతిగమికి
విధు సుధారస మాను వెన్నెల పులుగులు
మించునె యరుగునె మంచునాక,
గీ॥ యుష్మ దంఘ్రి సరోరుహ యుగళ నిహిత
చిత్తు డన్యుల జేరునే సేవజేయ?
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ గంగా తనూజాత గర్గ పరాశర,
వ్యాస భరద్వాజ వైనతేయ,
శౌనక వాల్మీకి శమ్యాక నారద,
రోమహర్షణ శుక వామదేవ,
కలి విభీషణ కుత్స కౌశిక మౌద్గల్య
బలి పుండరీక జాబాలి హారిత,
ప్రహ్లాద గౌతమ భార్గవ చ్యవన రు
క్మాంగద ముఖమహా మహులు గీను
గీ॥ సత్ప్రిభావాబ్ధి వర్ణనల్ సలుప జాల
రన్న మాదృశ పశుతతి కలవియగునె?
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జనపాల! మదన గోపాల బాల!.

సీ॥ వైకుంఠ, వామన! వాసుదేవ ముకుంద!.
కమలాక్ష! గోవింద! కనక చేల!
కృష్ణ దామోదర!, కేశవ! నగధర!
పరమపురుష! హరి! పద్మనాభ!
ముంజికేశి! పురాణపురుష! విశ్వంభర!
శ్రీవత్స లాంఛన! శేష శయన!
విశ్వోద్భవ స్థితివిలయ కారణ రూప!
నారాయణాచ్యుత నారసింహ!
గీ॥ చక్రధర కైటభాంతక శౌరి గరుడ
గమన! యని నిన్ను సతతంబు గణుతిజేతు!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ కౌస్తుభ భూషాయ గంభీర భాషాయ
భక్త పోషాయ తుభ్యంనమోస్తు!
జలధర శ్యామాయ సద్గుణ స్తోమాయ
భవ విరామాయ తుభ్యంనమోస్తు!
త్రిజగతీ రక్షాయ దేవతాధ్యక్షాయ
పంకజాక్షాయ తుభ్యంనమోస్తు!
వృజినాభ్రవాతాయ విపదబ్ధిపోతాయ
బ్రహ్మగీతాయ తుభ్యంనమోస్తు!
గీ॥ అహికులేశ శయాయ తుభ్యంనమోస్తు!
యని వినతి నీ కొనర్చెద ననుదినంబు!
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ పతగ తురంగాయ! పద్మానుషంగాయ!
పర విభంగాయ! తుభ్యంనమోస్తు!
శ్రితజన శ్రీదాయ! సేవిత పాదాయ!
భరిత వేదాయ! తుభ్యంనమోస్తు!
విధృత కౌశేయాయ! యభివృత దైతేయ!
మైత విధేయాయ! తుభ్యంనమోస్తు!
నిర్మల శీలాయ! నిరుపమ లీలాయ!
భరిత శైలాయ! తుభ్యం నమోస్తు!
గీ॥ యనుచు సతతంబు మ్రొక్కుచు నచలభక్తి,
నిరతిశయ దయ నేలవే నీరజాక్ష!
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ శంకర మిత్రాయ! శశిసూర్య నేత్రాయ!
భవ్యగాత్రాయ! తుభ్యం నమోస్తు!
పన్నగ తల్పాయ! పాప వికల్పాయ!
భక్త కల్పాయ తుభ్యం నమోస్తు!
పరిహృత కంసాయ! పరమ ప్రశంసాయ!
పరమ హంసాయ తుభ్యం నమోస్తు!
వైకుంఠ గేహాయ! వరద నీరసహాయ!
బద్ధమోహాయ! తుభ్యం నమోస్తు!
గీ॥ భావ సంభవ జనక! తుభ్యం నమోస్తు!
యనుచు దండమొనర్తు నే నచల భక్తి!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ తే నమోరక్షిత! దేవతాయ, మహేశ
భావితాయ మునీశ సేవితాయ!
తే నమో! నిగమాంత తేవనాయ త్రిలోక,
పావనాయ, సురారి లావనాయ!
తే నమో! జిష్ణుప్రేక్షీరణాయ, సమస్త
కారణాయ, దివ న్నివారణాయ,
తే నమో భక్త సుధీరతాయ, సుగుప్త
భారతాయ, వినమ్ర సూరతాయ!
గీ॥ తే నమో దీనకల్పక దివ్య పాద
పంకజాయ, యటంచు, నే ప్రణుతి సేతు!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ హరయే సముద్రుత గిరయే విహంగమ
వాహనాయ త్రిలోక మోహనాయ!
చక్రిణే దృశరసా చక్రిణే కౌస్తుభ
భూషితాయ రమా ప్రతోషితాయ!
హారిణే విలసద్వి హారిణే సనకాది
సేవితాయ మునీంద్ర భావితాయ!
విష్ణవే ముని హృచ్చరిష్ణవే రక్షిత
వారణాయ దురిత వారణాయ!
గీ॥ తే నమో యని నీ భక్త దివ్యపాద
మెలమి సేవింతు నన్ బ్రోవు మిందిరేశ!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ సాగర కన్యకా స్తనతటీ విన్యస్త
కస్తూరికాధ్యస్త కౌస్తుభాయ!
దేవరాజ కిరీట దివ్య రత్న ప్రభా
నీరాజితాంఘ్రి సరోరుహాయ!
నిఖిల చరాచర నిర్మాణ నిష్ణాత
శాబకాంచిత నాభి జలరుహాయ!
కాంచనమయ చేల కలితకాయ విలాస
నిర్జిత నచపల నీరదాయ!
గీ॥ తే నమో యని భవదీయ దివ్యపాద
జలజయుగ మాత్మ నెప్పుడు సంస్మరింతు!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ నర సురాసుర సిద్ధ నాగ విద్యాధర
సేవితాయ మునీంద్ర భావితాయ!
బాల భాను ప్రభా భాసమాన ద్యుతి
భూషణాయ విపన్న పోషణాయ!
వీక్షణ స్మితకళా విభవ విభ్రమ జగ
న్మోహనాయ విహంగ వాహనాయ!
దుర్దమ సంసార దుఃఖ లతా బంధ
మోచనాయ సరోజ లోచనాయ!
గీ॥ భవతు భవతే నమో యని ప్రస్తుతింతు
చిత్త మిగురొత్త పురుషార్థ సిద్ధి కొరకు!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జనపాల! మదన గోపాల బాల!

సీ॥ చారు మణిస్తంభ సాహస్ర మణి మంట
పాంత చింతారత్న భద్ర వీఠి,
హార నీహార శరీర భాస్వద్రత్న
తత సహస్రారు మస్తక ఫణీంద్ర
పర్యంకమున భూమి పద్మాలయలు కరి
పంకేరుహంబులు పదము లొత్త,
నంద సునందార్హ్వాణ జయ విజయులును
సనకాదులును వియచ్చరులు గొల్వ,
గీ॥ ఘన కృపాదృష్టి నారద గాన రవము,
వించు వైకుంఠమున శయ నించి తౌర!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భ క్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ తళుకు బంగరు గోడ తల్పుల మాళిగల్
తీరుగా దిరుమల దీర్చి కట్టి,
భోగ భాగ్యంబులు బొంది చూపుల నింద్ర
పదవిచ్చు నిందిర భార్య గాగ,
జనులకు రోగముల్ సంభవింపగ జేసి
ముడుపులు వరహాల మూటలీయ,
దడసిన వడ్డితో దండించి గైకొని
గాకున్న మరలంగ గలుగజేసి,
గీ॥ భాగ్య మార్జించ బదవల బడుదు నాలు
బిడ్డలకు నన్న వస్త్రముల్ బెట్టలేవె?
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ గొల్ల మిటారుల గూడితి వంటివా
జున్ను మీగడ పాలు వెన్న పెరుగు
-చోరత్వమున దిన జూచితివంటివా
కల్లరి పనులను గాసిజేసి
పౌరులచే రవ్వ బడియుంటి వంటివా
మెత్తని మనసున నత్త గూడి
సిగ్గరి యారడి జెందితి వంటివా
గొల్ల పిల్లల తోడ గూడి కాన
గీ॥ పసుల మేపితి వంటివా భళిర! కనరు
బూన గతమేమొ? తెలుపరా! భుజగ శయన!
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ చెలువలు జలకేళి సేయబోయిన వెన్క-
పొంచి వల్వలు దొంగిలించి నావు!
కొంకక యొక నరు కూర్మికి లోబడి
బైసుమాలి గురాల బట్టి నావు!
దారి జేరిన కంసు దాసివై దాసిన
ననవింటి దొరకేలి బెనగి నావు!
పేద పారుడు ముష్టి బెట్టు నటుకుల కాస
మించి లోభి తనాన మెక్కి- నావు!

గీ॥ గొప్ప కొంచెం బెరుంగని గొల్లయింట
గల్గు తక్కు-వ గుణములు కానవచ్చె!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల! 80

సీ॥ ఇద్దరు మొగులను ముద్దుకూతురు జేరి
వాసి మీరగ బెండ్లి జేసికొనిరె,
అనుగు చెల్లెలు మోహ మగ్గలంబుగ నొక్క-
భిక్షునిపై కూర్మి బేర్మి జరిగె,
కూతు నాలిగ జేసికొను వేల్పు పెద్దనా
పేర్మి మీరగనుండె పెద్దకొడుకు,
మగ డెన్నడో చచ్చి మదిగుందు మగువను
నీ చిన్ని కొడుకు కాలినిగ నొనర్చె,

గీ॥ పరగ నీ వారి చర్యల పగిది నెన్న
పలికినను విన్న జన్మ సాఫల్య మహహా!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ జారుడ వని నన్ను సడ్డ సేయగవద్దు
చోరుడనని చుల్క జూడవద్దు
మాయావి యని నన్ను మాటలాడగవద్దు
సరికక్రిముడనని చాటవద్దు
నీవేమి తక్కువ నిజమాడ కోపంబు
భగవంతుడవు గాన బరగిపోవు
లేదని బొంకకు వాదాడ నాకేమి
గోపికల్ గొల్లల కొట్లసింధు
గీ॥ రాజ యవనులు సాక్షులు రోజగలరు!
వాదు మర్మజ్ఞులతో నాడ వలదయ్య!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ మధురాపురంబుపై మగధేశు డేతేర
పారిపోయితి వని పల్కినాన,
కాలయవనుడు వచ్చి కాచి ముట్టడిసేయ
తప్పి దాటితివని చెప్పినాన,
పశిగాపు జవరాండ్ర బట్ట లారసి దొంగి
లించితివని ప్రకటించినాన,
ఊరు వారల రవ్వ లోర్వజాలక తల్లి
రోట గట్టిన మాట జాటినాన,
గీ॥ మిన్నకే నన్ను పేక్షింప మేలటయ్య!
గుణము భావము గనుగొన గూడదయ్య!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ గురు కుటుంబినితోడ గూడి క్రీడించు నీ
గాదిలి మరదిపై కరుణ లేదె?
మదిరా రసాస్వాద మదయుక్తి నలరారు
అన్నపైన ననుగ్రహంబు లేదె?
బ్రహ్మ హత్యా క్రియా పరత వర్తిలుచున్న
యల్లునిపై కూర్మి యరయ లేదె?
దొంగిలి కురుపతి దుహితను దెచ్చిన
వర సుతుపై కనికరము లేదె?
గీ॥ బిడ్డ నని మ్రొక్కి పదములు బడ్డ నన్ను
పాతకి వటంచు విడనాడ బాడి యగునె?
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జనపాల! మదన గోపాల బాల!

సీ॥ అక్రూర విదురులయందు గాంగేయ వి
జయులందు ధర్మజ శౌరులందు
గోరు గోపికలందు గో వత్స తరులందు
ద్రౌపదీ మత్స్యేశ తనయులందు
ద్వాదశ భాగవత శ్రేష్ఠులందును
యుద్ధ వాదికయందు వృద్ధులందు
శృత దేవ బృహ దశ్వ సిద్ధు లందును విప్ర
భార్యలం దేకాంత భక్తులందు
గీ॥ నే విధంబున దయగల్మి సేవ యొసగి
బ్రోచితో నన్ను కృపనటు బ్రోవుమయ్య!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ చేపవై, తాబేటి రూపొంది, పందివై,
మానిసి సింగమై, గూని చిట్టి
పొట్టివై, జడదారి పట్టివై, రెండవై,
నాగేలు జారివై, జాగుకాలు
కేలు లేకను గ్రాలు కీల్గల వాడవై,
పొరుడవై బుట్టి, పంచయజ్ఞ
జప తపో వ్రతదాన శాస్త్ర వేద పురాణ
విప్ర గో దీనుల వెతలు మాన్పి,
గీ॥ బ్రోచితివి నాకు నేడు నా పూర్వ కర్మ
ఫలము గాబోలు! మొరబెట్ట బలుక వహహా!
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ మత్స్య కూర్మ వరాహ మనుజ పంచాస్య వా
మన రామ రామ రామ ముఖ బౌద్ధ
కల్కి ప్రముఖ సుయజ్ఞ గురు దత్తాత్రేయ
వృషభ వైన్య ధృత పీతి వదన
నారాయణ ద్వీప నాథ రక్షక హంస
ధన్వంతరి వ్యాస మన్వనేక
తనువులు ధరియించి ధర్మ భూసుర వేద
దీన తాపస యాగ దివిజ బాధ
గీ॥ లణచితివి నాడు నేడెందు గుణము జనిమొ?
భక్తులను దుర్జనుల బాధ బరుపగాను!
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ కడలి కరళ్ళ రాయిడిని గీష్పడకుండ
నావచుట్టును జగనాథు జుట్టి
వైవస్వతుని మునివరుల సస్యౌషధీ
చయముల నందున సంఘటించి,
మగమీన రూపున మగటమి వాటించి,
మున్నీటి పెన్నీట మునుగకుండ,
పాలదించి గమిజోదు బోకార్చి వేలుపు
ముదుకని కామ్నాయముల నొసంగి,
గీ॥ వామదేవ ముఖామర వరులు చెలగి,
వినుతి యొనరింప వెలసిన వేల్పు వీవ!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ మందరాః హార్యము మంథానముగ నహీ
శ్రాడుగా గీర్వాణ దైత్య వరులు
అమృత సంపాద నాయత్త చిత్తంబుల
పాలవెల్లి మదించు బైల శైల
మంబుధి బుడబుడ మని మున్గ గని వగ
గూరు బృందంబుల కొందలమున,
బాపురే! గోవింద! పద్మనాభ! ముకుంద!
త్రాహి! యంచు వచించు తఱిని కూర్మ
గీ॥ మూర్తి తరిగొండ వీపున మోసినట్టి,
భక్త వాత్సల్య మెంతని ప్రస్తుతింతు!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ తపనీయ నేత్ర న క్తంచరుఁడు రువడి
భూత ధాత్రిని గొని ప్రోదిసేయ,
నిర్మగ్నముగ జేయ నీవు యజ్ఞ వరాహ
రూపంబునను వాని రూపుమాపి,
సగిరి కానన సరి త్సాగర ద్వీపగా
దంష్ట్రాగ్రమున పైకి ధరణి నెత్తి
రోదసీ కుహరంబు భేదిల్ల ఘుర్ఘుర
ధ్వాన వినిర్భిన్న దైత్య భీరు
గీ॥ గర్భ గోళుడ వై పద్మగర్భ ముఖ్య
దేవతావళి నేలిన దిట్టవీవె!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భ క్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ ప్రళయ కాలోత్తాల భయద మహోజ్వాల
ఫాల చక్షుఃకేలి పాలితోటి,
బోరామి జూపెడు పోడిమి చేడిమి
గల్గు మంటలు వంట కంట నసుర,
పట్టు సభా స్తంభంబు పటపట పగులు మా
నవ మృగేంద్రాకృతి నవతరించి,
ఖరకర నఖరాళి కనక కశిపుజించి
త త్తనూజుని కృపాతంత్రదృష్టి,
గీ॥ గాంచి కిన్నర గంధర్వ గరుడ యక్ష
విభుల నుతిగన్న నిన్ను భావింప దరమె?
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భ క్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ అడవుల నిడుముల బడు వేల్పుదొర గావ
  నదితి గర్భంబున నవతరించి,
జిలిబిలి నుడువుల జిడిముడి నడలను
  వడుగువై బలి యజ్ఞ వాటి కరగి,
యవని మూడడుగులు యాచించి దివి భువి
  యడుగుల రెంటిని నాక్రమించి,
మూడవ యడుగిడ జూడగా నచ్చోటు
  యాతని తలనిడి యడుగు కణచి,
గీ॥ మెలమి సామ్రాజ్య మింద్రుని కిచ్చినట్టి,
ఘన త్రివిక్రము నిన్ను నే గణుతిజేతు!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ భార్గవాన్వయ దుగ్ధ పాథోధి విధుడైన
  జమదగ్ని మౌనికి జననమంది,
తత కఠోర కుఠారధారను త్రిస్సప్త
  కృత్వముకే క్షితిపాలి గేలి గూల్చి,
తత్పృథిరోదార తటినీ పయఃపూర
  కృత పితృ తర్పణ క్రియల వెలసి,
విశ్వ విశ్వంభరా విశ్రాణన ప్రీత
  భూదేవతానుత పూతకీర్తి
గీ॥ దిశలు వెలుగొంద భృగునామ దివ్యనామ
మెలమి బూనిన దేవుడ వీవె కావె!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భ క్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ దశరథ సుతుడవై దాటకి మర్దించి,
బాసవాల్ దొరగోరు పని యొనర్చి
గట్టు విల్తుని విల్లు ఖండించి, మైథిలి
గైకొని, జనకాజ్ఞ కాన కేగి,
ఖరుడాది యగు నిశాచరులను దున్మాడి,
వనజాప్త సుతుఁగూడి, వాలిఁగూల్చి,
కడలి కడంక బోకార్చి సేతువు గట్టి,
దశముఖు బొలియించి, తదనుజునకు
గీ॥ లంక దయచేసి, జానకీ లలనఁగూడి,
వేలుఁ బదకొండు వర్షము లేలితౌర!
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ భార మోఁగగలేక గోరూప మురధర
సరసిజాసన ముఖ సురలతోడ,
పాలవెల్లికి జని ప్రార్థింప దేవకీ
గర్భ శుక్తికి మౌక్తి కంబనఁగ,
జనియించి కృష్ణుఁడు సహజుఁడుగా రోహి
ణికి బుట్టి దనుజుల నీరుజేసి,
కాళింది భేదించి, కరిపురి దెమలించి,
రేవతీ రమణి బరిగ్రహించి,
గీ॥ బలు డనంగను విఖ్యాతి బ్రబలి భూమి
భార ముడిపిన బలరామ ప్రభుఁడవౌర!
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ పుర నిశాచరు లల్క సురల బాధింపంగ,
గని కనికరమున కమలమిత్ర
శశిను మేరు శ్రుతుల్ చతురాననానంత
సర్వంసహా చక్ర చాపవాహ,
సారథి జ్యాలతా స్యందనములు గాన
ఘటియించి నీవు మార్గణత మించి,
హరునిచే త్రిపుర దైత్యావళి మడియించి,
బుద్ధావతార విస్ఫురణ బరగి,
గీ॥ నిర్జరావళి నేలి నిర్ణిద్ర కీర్తి
నాధ నెలకొంటివౌ జగన్నాధమందు!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ చరణ సహస్రముల్ చక్షుసహస్రముల్
కర్ణ సహస్రముల్ కర సహస్ర
కంబులు నాసికా కంఠ సహస్రముల్
కిరణ సహస్రము లురు శరీర
సాహస్రకంబులు చారు కిరీట స
హస్రముల్ కుండల హార కటక
కంకణ కేయూర కాంచీ సహస్రముల్
రవికోటి దీప్తిచే రాజిలంగ,
గీ॥ మస్తక సహస్ర మణి ఫణి మంచమందు
ప్రణవ పదయోగి నిద్రచే బంశి తౌర!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ తామ్రపర్ణీ తీర ధర శంబళంబను
పురవరంబున నతి పుణ్యుడైన
విష్ణుయశుండను విప్రున కుదయించి
కల్కి యన్ పేర విఖ్యాతి గాంచి,
సజ్జనావన ధుర్య శౌర్య తేజీ నెక్కి
కరమున మండలాగ్రము చెలంగ,
కలి సమేధిత పాప కర్మిష్ఠా మ్లేచ్ఛుల
ననుత బాంధవముగ సంహరించి,
గీ॥ సర్వ వర్ణాశ్ర మాచార సరణి నిలిపి,
తేజరిల్లిన నిన్ను నుతింప దరమె?
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ ఉద్ధవ క్రూరాంధకోగ్ర సేనానక
దుందుభు లొకచెంత దొడరి మెరయ,
సాంబ సారణ గద చారు ధేష్ణాది కు
మార వారములొక్క యోర జేర,
కోసల సృంజయ కురు మత్స్య పాంచాల
కేకయు లొకవంక కేరి కొల్వ,
సరి గద్దియల బల సాత్యకుల్ సేవింప,
రత్న రంజిత సుధర్మాంతరమున
గీ॥ నీవు పేరోలగంబున నీవి దేవ
వర సుతుని తోడ భాగించు వగ దలంతు!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ శయ్య నొయ్యన కల్మి తొయ్యలి నెరజిల్గు
వలిపె పయ్యెద చెంగు వగ బెనఁగు
కేల్దమ్మి మఱలింప కీలౌచనం బన
నావెన్క పురనారు లాపిరుంద
చిండము చక్రమా చెంగట కొన ధను
వామీద గదయు నాయా తుదలను
విహగ వర సురముకు లావల వలరాయు
డాపైని సైన్యేశు డరుగు దేర
గీ॥ మకరి మడియించి కరివరు మనిచి సురలు
విరుల వానలు గురియింప వెలసితౌర!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జనపాల! మదన గోపాల బాల! 100

సీ॥ అడవుల పాండవు లిడుములు బడువేళ
కురుపతి బోధన కుత్సితమున
నొకనాడు దూర్వాసు డేగి ననేక సహస్ర
శిష్య ప్రశిష్యులు చేరి కొల్వ
చని ధర్మజుని గాంచి సరస పదార్థ సం
పన్నమై నతిగన్న యన్న మొసగు
మన్న మిన్నొగి మీద గ్రన్నన నొరిగిస
వన్నె యాతడు మిన్న కున్న తఱిని
గీ॥ ద్రౌపదీ దత్త శాక మాత్రము భుజించి
భోజ్య పూర్ణత ధర్మజు బ్రోచితౌర!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ దురమున నభిమన్యు డనుము పిరుందన
 వడము షి శోకాగ్ని వందికుంది
మరునాడు సైంధవు మడియింతు గాని-వో
 నగ్నిలో బడువాడ ననుచు బ్రతిన
బూనిన నారేయి సూన వితానత
 జాను పూజత నొందు వాని గూషి
కైలాస గిరికేగ, గను శర్వు నుతియించి
 పాశుపతంబీయు బనిచి దేవ
గీ॥ వర కుమారునిచే సింధు వసుమతీశు
మడియగాజేసి యర్జును మనిచి శౌర!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ పరమ పూరుష! వర పరమేశ! పరమాత్మ!
 పతిత పావన నామ! పద్మనాభ!
పన్నగేశ శయాన! పతగ నాయకయాన!
 పశుపతి సన్మిత్ర! పద్మ నేత్ర!
పాప లతా దాత్ర! పావన చారిత్ర!
 పాండవ పాలక! పార్థసూత!
పైల పరాశర పర్వత పావక
 పంచ శిఖార్చిత పాద పద్మ!
గీ॥ పాక శాసన పరమేష్ఠి ప్రథిత నామ!
పుండరీక విలోచన! పుణ్య పురుష!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ తీరైన కస్తూరి తిలకంబు గని వాని
జిలుగు కడాని దువ్వలువ వాని
మకర కుండలు వాని మలయు చెక్కుల వాని
డంబైన మణి కిరీటంబు వాని
నిందీవరచ్ఛాయ నీను దేహము వాని
తలిరుల గెల్వు పాదముల వాని
శంఖ చక్ర గదాసి శార్ఙ్గ నామక దివ్య
సాధన కర పంకజములవాని

గీ॥ మానసాంభోజ కర్ణికా మధ్యమందు
గనెను నినుభీష్ము డవసాన కాలమందు!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ మరకత శ్యామంబు సరసిజ నేత్రంబు
మకర కుండల గండ మండితంబు
దివ్య రత్న ప్రభా దీప్త కిరీటంబు
సురుచి పీతాంబర శోభితంబు
మందస్మితాపాంగ సుందర వదనంబు
కుంద కుట్మల నిభాంకురరదంబు
కంకణ కేయూర కౌస్తుభోపేతంబు
శంఖ చక్ర గదా శరా సంయుతంబు

గీ॥ నైన నీ రూపు గన్నుల హర్ష మెసగ,
గాంచ గలభాగ్య మెన్నండు గలుగు నొక్కొ!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ రంగదుత్తుంగ విహంగ పుంగవ తురం
గంబుపై నెక్కి నాకంబు కేగి,
శంపల సొంపున నింపు నింపు నిలింప
చెంపకామోదలు ముంప విరుల,
నందన మందు మిళింద బృందంబుల
నందమౌ మందార మంది బెరుక,
నందంద వినుచు పురందరుం డొగి దాక
చిందర వందర జేసి వాని,
గీ॥ సత్యభామా మనోహార సాధ పాళి
కేళికావని నాటితి బాళి మీర!
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ శాసించు జాళువా రాయంచ పనికినె
రాకావి పావడ జోక గట్టి,
మగరా కళాశికీ సొగసు నాయగ్వాజు
బందులు సందిట నంద మొంద,
పైఠాణి కంచల బల్మ గ్రిక్కిరిసిన
గబ్బి గుబ్బల యందు గాను పించ,
నించుక సరిగంచు పంచ జారించి వం
చించి శాత్రించర సంచయముల
గీ॥ ముంచి మోహాబ్ధిలో సుధ బంచి సురల
కంచితంబుగ నొసగు నిన్నెంచ దరమె?
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ విశ్వ విశ్వంభరా విభుల దోడుగ గోరి
సేనలలో కురు క్షేత్రమునకు,
కురుపతి ధర్మముల్ గూడిన తరితమ
భయ సైన్యముల మధ్య భాగమందు,
తేరు కవ్వడి నిల్పి తేరి పారగ జూచి
బంధు సోదర సుహృద్భాగినేయ,
ముఖుల జంపగ నోడి మోహవార్ధి మునింగి
ధనురాది సాధనోత్కరము విడువ,
గీ॥ విశ్వ రూపంబు జూపించి విజయునకును,
నాత్మ విద్యావగతి మోహమణచి తౌర!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ బలశాసనోపల ఫలకోమల కిరుచి
మూర్తివా డురుకళాస్ఫూర్తివాడు,
కౌస్తుభ వనమాలి కాంతి రాజితమైన
గోమువా డెలనవ్వు మోము వాడు,
కరుణా కటాక్ష వీక్షావళి ననదల
నేలువాడిరుదోయి కేలు వాడు,
వీడె కృష్ణుడు రాజ వీధి నేతెంచెను
రారె చూడుడటంచు రాజ ముఖులు,
గీ॥ నోలి మధురాపురంబున నొకరి కొకరు
జూపు నీరూపు నెన్నడు జూతు వాడ?
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ అజగర గజరాజ యానలు వేవేల
విధముల వినుతించి విభుని ప్రాణ
వితరణ మొనరింపవే యని మ్రొక్కిన
కరుణారసస్ఫూర్తి గడలు కొనగ
కాళి యందంద శూక శిరోగ్రనటనము
చాలించి నయమూర్గ సరణినిల్పి
జలధి కాతని బంప్పి జనయిత్రి మొదలగు
వల్లవీ జనులెల్ల నుల్లసిల్ల
గీ॥ సుజను గావించి కాళింది సురలు విరుల
వాన గురిపించి వినుతించ వరలి తౌర!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ సరస యామున తటసాల శీతల తరు
ఛాయ లందరు గూడి చల్దిబువ్వ,
భుజియించు తరిదరి ఘాసగు పచ్చిక పట్ల
కసవులు మెసవు లేగలను కుఱ్ఱ
లను కమలాసను డనువున గొనిపోవ
గని వారి పోలిక కన్న వెన్న,
కాలును కేలును కరములు శిరములు
ముక్కులు జెక్కులు మోము గోము,
గీ॥ మెడలు తొడలును తల్లుల కడరు వేక్క
మించ నెంచి విరించి వంచించి తౌర!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ నిద్దంపు టద్దంపు టుద్ది చెక్కిట మగ
మానికంబుల పొగలూని మెరయ,
జగి కడాని మెరుంగు జిల్గు దుప్పటి రంగు
మెయినల్ల మబ్బుకు మెరుగు గాగ,
గాంగేయ శరవిద్ధ గాత్రుడవై నీవు
కిన్కతో సుడివాలు కేల బూని,
యరదంబు వెసడిగ్గి యరిగెడు తరి నరు
డడ్డమై వలదంచు ననునయింప,
గీ॥ విడువు పీనిని దునుమాడి విజయ మిత్తు
పదర వలదంచు పార్థుని బల్కితౌర!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ వాలు వాలుగ మీల డాలు డాలుగ జేయు
జాలు జాలున మించు వాలుకన్ను
గవతోడ వలబడ్డ కవజక్కవల వలె
వలుద చన్గవ పైట వలను జెలగ,
వ్రజ రమణీ మణీ వారము తీరము
జేరి చీరలు పెట్టి నీరు సొరగ,
పొంచి నీవవి దొంగిలించి చెట్టెక్కిన
గాంచి యీపని మంచిగాదు మాకు,
గీ॥ కూలము లోసంగి మమ్మేలు కొనుమటన్న,
నెట్టకేలకు దయచేల లిచ్చితౌర!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ కడలి నడుమ విశ్వకర్మ రచించిన
ద్వారక యన్పేర దనరు పురిని,
వెలదుల బదియారు వేలనూటెనమండ్ర
బరిణయమై కూడి పదుగు రేసి,
కొమరుల నొక్కొక్క కువలయ నేత్రికి
గని పెక్కు రూపుల గలయికలను,
ఎనసి నూటిరువదేనేడులు బహువిధ
విభవ సమృద్ధుల వెలసి దుష్ట,
గీ॥ శిక్షయును శిష్టజనరక్ష జేసినట్టి
నిన్ను గొనియాడ దరమె వాణీశు కైన?
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ నగధర వనరుహ నయన ముని వినుత
కటితట సులలిత కనక వసన,
కరి వరశుభకర వనరుహ కర వనరుహ దర
విలసిత తనురుచి తులిత ముదిర,
దశశత నయన సుత సఖ నరక హర
కవిజన మధువిన గరుడ గమన,
నరగజరిపు తనుధర మురముఖసుర
రిపుధరభికర భరిత సుకరుణా,
గీ॥ వితత సురగణ నుతగుణా విమల చరిత
విషధర వర శయన సుమవిశిఖ జనక!
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ సర్వ చరాచర సంయుత బ్రహ్మాండ
  భాండముల్ బొజ్జలో పదిలపఱచి,
సకల లోకంబులు జలమయంబుల జేసి
  బాలుడవై వటపత్ర మందు,
యోగ నిద్రాముద్ర నొగి బవ్వళించిన
  నీ మ్రోల గేలిమై నీలకంఠు
డానంద కాననాథ్యస్త శూలాగ్రుడై
  బచరించు తాండవ భద్రరీతి,
గీ॥ గనుచు కరమున పదమాస్య కమల మందు,
నిలిపి యేకాకివై భళి! నెగడి తౌర!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ తల్లి దండ్రుల వీడి దైతను దిగనాడి
  గోవాళ్ళ మూకల కోర్కెగూడి,
మత్తిలి త్రొత్తును మరిగిన విత్తంబులు
  తెక్కలి తనమున దెచ్చి పెంచి,
పదుగురు కొడుకుల బడసిన పాపుడు
  ఖలు డజామిళు డంత్య కాలమందు,
నారాయణా! యని నందను బిల్వంగ
  నిర్హేతుకపు కృప నివ్వటిలగ,
గీ॥ కాలకింకరులను బారద్రోలి యోగి
సంచయ ప్రాప్య మోక్ష మొసంగి తౌర!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ పత్ర పాత్రలు చేత బట్టి బొట్టెలు బట్టి
పట్టెడన్నము మాకు బెట్టుడనుచు,
మలమల మాడంగ మది నోర్వజాలక
విని తల్లి మరటిల్లి విభునిజేరి,
మిన్నక మీరిటు లున్న నేమగు నన్ను
మన్నించి వెన్నుడు చిన్ననాట,
నెచ్చెలి యని మున్ను ముచ్చటించెదరు మీ
రరిగిన గనికని కరిము మీర,
గీ॥ సంపద లొసంగు ననిపంప జని కుచేలు
డటుకు లిడినంత సిరులిచ్చు యనిచి తౌర!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ కావెర్ఘుకీవజ్ర ఖానికె నేరాల
వగవల్వ రింగులు వారగట్టి,
వల కేలితోత్ర మవ్వలికేల పగ్గము
లుంచి మావుల నదలించి యస్త్ర,
శస్త్ర సంధాన మోక్షణ విచక్షణ తన
క్షీణులౌ శాత్రవ క్షితిప తతుల,
నాలోక మాత్రాన హతజీవితులజేసి
రథ వరూధమున విభ్రాజమాన,
గీ॥ మూర్తి వెలుగొందర రహిజయు స్ఫూర్తి కీర్తి
దనర జేసితి వౌర! నర్జునుని భువిని
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ అపరంజి జిగిచాయ నలరు నిద్దానిగ్గు
మెుగ్గ పావడ జగ్గు మురవు జూప,
మంచు క్రొమ్మించు పైసంచరించు వితాన
సరిగంచు పంచమైసంచు బొదువ,
పురిరాచ చిగురాకు బోడులు దోడురా
దొదాల దళవాయి దండు గొల్వ,
రాయంచ నడినొక్క రామకై దండను
గుబ్బలి రాచూలి గొల్చు వచ్చు,
గీ॥ తరిని మాగధ శిశుపాల దంతవక్త్రి
పౌండ్రకుల ద్రోలి రుక్మిణి బడసితౌర!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ చల మనీషుడ దుష్టచరితుడ మత్తుడ
పాపుడ మన్మథ పరవశుండ,
ఖలుడ నీచుడ మిత్ర ఘాతిని ద్రోహిని
క్రూరుడ లోభిని కుత్సితుండ,
మందబుద్ధిని వావి మానిన వాడను
కోపిని చపలుడ కుటిల మతిని,
నిర్దయుండను క్రోధ నిరతుండ చోరుడ
పరధనాసక్తుడ పాతకుండ,
గీ॥ వెతకి బ్రహ్మాండమున పాపి వీని కంటె
నెన్న లేడని దయ వింత నేలవలెను!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ ద్రౌణి బాణానల దాహ భయభ్రాంతి
జని జనార్దను గని వినయ మొసగ
బ్రణమిల్లి నల్లనచెల్లెలి కోడల
నల్లుడు దురమున జెల్లె నుల్ల
మున దమ మల్లడిగొన దల్లడిల్లెడు
గర్భంబు గావలె కమల నయన
యంచు నుత్తర వేడ నాంగుష్ఠమాత్ర శ
రీరుడవై సహస్రార మమర,
గీ॥ కరమున ధరించి కరవహ్ని కణకమాని
గర్భ సంరక్ష జేసిన ఘనుడ వౌర!
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ అడవుల నిడుముల బడు పాండవేయుల
కడపట వసియించి గాచినావు!
పడరాని బాధల బడిబడి బడలిన
నెన్నడో ప్రహ్లాదు నేలినావు!
కారాగృహంబుల గాసి నొందిన తలి
దండ్రుల నెప్పుడో దలచినావు!
వేయు వత్సరములు వెతల వేసటబడి
పొక్కెడు కరిరాజు బ్రోచినావు!
గీ॥ గాని దురవస్థ గల్గు తక్షణమె వచ్చి
యెవరి నేలితివో కృప నెరుగ జెప్పుమ!
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ సజల నీలాంబుద శ్యామల కోమల
కాయ యోగీంద్రధ్యేయ కాయగేయ!
శ్రీరమణీమణీ చిత్తకాసారక
హంస సుధాకరోత్తంసశంస!
మణిమయ కుండల మండిత గండ వి
లాస భక్తార్తి నిరాసహాస!
కోటి సూర్యోజ్జ్వల తోర్కిరీట భాసిత
మస్త చక్రాంకిత హస్తశస్త
గీ॥ భక్త జనపోష! పరితోష! పరమ పురుష!
శ్రిత జనాధార! మునివార నుతవిహార!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ తల్లియు తండ్రియు దైవంబు గురువును
పతియును గతియును బ్రతుకు దెరువు,
ప్రభువును సఖుడును బ్రగ్గడ తోడును
నెమ్మది నీవని నమ్మి నెమ్మి,
తృటికాల మైనను ధృతినెడ బాయక
వర్తించు యాదవ వరుల కెల్ల,
వారికి నన్యోన్య వైరానుబంధంబు,
బుట్టించి వారల బొలియ జేసి,
గీ॥ సచ్చిదానంద మూర్తివై సంచరించు,
నీకు పక్ష విపక్షముల్ నెరయ గలవె?
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల! 125

సీ॥ రక్షక రహితుల రక్షించుటకు నీవు
రాజు వంచు పురాణ రాజయోగి
గణ ముగ్గడింపాగ కడు నమ్మి, గోవింద!
కమలాక్ష! మాధవ! కావు మంచు
నీ కథల్ బాడుచు నీ చరిత్రలు వించు
నీ దాస జనగోష్ఠి నెగడి నిన్నె
కాని యన్యమెరుంగ కలనైన నను బ్రోవ
విధి నీకు నిను వేడ విధిమె నాకు!
గీ॥ గాన నను బ్రోవ పెరవారు గలరె యహహ!
కలయ బచ్చలి కేలయ్య కంద దురద!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ భోజ కన్యా ముఖాంభోజ విభాకర!
సత్యభామా కుచశైల ముదిర
జాంబవతీ చిత్త సారస సారంగ!
లక్ష్మణా యకావ నారణ్య దంతి!
మిత్రవిందా మనో మృగ విలాసా హర్య!
భద్రాసతీ దృగుత్పల శశాంక!
తపన సుతాపిన తనులతా తాపిచ్ఛ
తర సుదంతా బీష్ట వన వసంత!
గీ॥ షోడశ సహస్ర శతసంఖ్య సుందరీ ని
కర మనో శుక పంజర కాంత దేహా!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ అల కుచేలుడగాను అటుకులిచ్చి మహేంద్ర
పద విభవంబంది పరిఢవిల్ల,
పాయకుండనుగాను భక్తి భూష లొసంగి
సర్వ సంపదలను సంగ్రహింప,
శృతదేవుడనుగాను నుతి నమస్కృతులచే
సొరిది కైవల్యంబు చూరగొనగ,
విదురుండ నేగాను విందుజేసి భజంచి
చిరతరోభయ సౌఖ్య సిద్ధిగనగ,

గీ॥ ఏ విధంబున గరుణ రాసేవ జేయ
గలను నిర్వాతు దయనేల వలెనుగాసి!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ కట్టంగ నల్లని పుట్ట మన్న కొసంగ
కళుకు బంగరు వల్వ గట్టినావు!
యన్నకు రోకలి యాయుధంబుగ నిచ్చి
పటు రథాంగము నీవు బట్టినావు!
తాడిసిడంబన్న తెరవుగ నొసరించి
ఖగరాడ్ధ్వజం బీవు గాంచినావు!
తారతమ్యంబెంచి తగవు బెట్టకయుంచ
సీధువు ద్రావంగ జేసినావు!

గీ॥ అన్న దమ్ముల భాగంబు లనువు పరుప
మిమ్ము గన ధనధాన్య సమృద్ధిగాదె?
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ మకరిచే కరిరాజు చికమక పడిచిక్కి
మొరబెట్ట రక్షింప నరిగినావా!
తండ్రి బాధల కోడి దనుజాత్మజుడు జూప
స్తంభంబులో నిల్వ తలగినావా?
వర పరీక్షుకు తల కరమిడు వృకు గని
డాగు శంభుని సాగనేగినావా?
సోమకాహృత శ్రుతి స్తోమ మబ్జజు జేర్చ
సత్య లోకమునకు జరిగినావా?
గీ॥ పలుకవే కృష్ణ! గోవింద! పద్మనాభ!
యనుచు మొరబెట్ట వైకుంఠ మందు నున్న,
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ మకరి బట్టిన బాధ మాన్పుమంచు నుతించు
కరిరాజు గాచుట కల్లగాదు,
కరుణ గుచేలుని గని ఘన సంపత్తి
మిగులంగ నిచ్చుట మిథ్యగాదు,
కురుపతి ద్రౌపది కోకలు విప్పింప
లలిచేల లిచ్చు టుళక్కి గాదు,
మనుజ సింహాకృతి జనకుని జంపి త
త్సుతుని రక్షించుట సున్న గాదు,
గీ॥ యేమి సేయుదు నా భాగ్య మేమొ కాని,
వేయు విధముల వినుతింప వినవు కనవు!
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ కమలాక్ష కల్ప వృక్షము గల్గి యుండగా,
కామితార్థములకు కాంక్షలేల?
సామజ వరద చింతామణి యుండంగ,
కోర్కులకై యాస గొనగనేల?
దాన వాంతక కామధేనువు గల్గ మ
నోరథ సిద్ధికి నుడువ లేల?
వనజ నాభామృత వారాశి గల్గంగ,
నజరామరత్వ సిద్ధాంతమేల?
గీ॥ ననుచు ధైర్య సమగ్రత నలరు నన్ను,
వంచన మొనర్ప నిసుమంత వల్లలేదు!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ యమభటు లుద్భట తమ గదా ఖడ్గ ము
ద్గర ముసలాది సాధనము లొలయ,
చండ రూక్షేక్షులై మండుచు ముప్పున
ముందర నిల్వ నామ్రోల నీవు
కరముల శంఖ చక్రములు శోభిల్లంగ
గరుడ వాహన మెక్కి కౌస్తుభంబు,
వనమాల సిరి యురమున వెలుగొందంగ
సనకాది మౌనులు సన్నుతింప,
గీ॥ కుముద నందసునందులు గొల్వ వత్స!
వచ్చితి నటంచు సెలవీయ వలెను సుమ్మా!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ విశ్వేశ్వరుండవు, విశ్వభరుండవు,
విశ్వగురుండవు, విశ్వగుడవు,
విశ్వోద్భవస్థితి విలయకరుండవు,
విశ్వవేద్యుండవు విశ్వదుడవు,
విశ్వధూరుండవు, విశ్వకరుండవు,
విశ్వాత్మకుండవు, విశ్వుడవును,
విశ్వరూపుండవు, విశ్వమయుండవు,
విశ్వసాక్షివి, విశ్వ విభుడ వీవు,
గీ॥ విశ్వ భరణుండ వని నిన్ను విశ్వసించి
నాడ రక్షింతువని చాల నమ్మినాడ!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ సర్వేశ్వరుండవు, సర్వజ్ఞమూర్తివి,
సర్వతోముఖుడవు, సర్వగుడవు,
సర్వంబునీయందు, సర్వమందున నీవు,
సంచార మొనరించు, సర్వమడవు,
సర్వనియంతవు, సర్వసంభాతవు,
సర్వదృక్కువు, సర్వసముడ వీవు,
సర్వనిర్నేతవు, సర్వచరాచర,
సాక్షివి సర్వసంస్థానకరుడ,
గీ॥ వహావా! సర్వ సముద్భవ సర్వహారుడ
వనుచు మదినెంతు పంకేరుహాయతాక్ష!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ పాలమున్నీటి రాపట్టి పేరెద గుల్క-
కడలి బుట్టిన కెంపు కళలు జిల్క,
మొసలి వాపోగుల మొల్క నిద్దానిగ్గు
తళ్కు- లేజెక్క టద్దములఁ బోడల,
సుడివాలు వలమురి యుడిదంబు గదవిల్లు
కైదువుల్ కరముల నైను మెరయ,
పసిమి క్రొంబసిడి దుప్పటి రంగు గొనబారు
నల్లని మేనిపై నుల్లసిల్ల,
గీ॥ నక్కటికమూని పక్కిరాజక్కి నెక్కి,
జాగు సేయక దర్శన మీగదయ్య!
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ దిశలు కర్ణంబులు శశి సూర్యు లక్షులు
నీరంబు శుక్లంబు నింగి శిరము,
శ్వసనంబు నూర్పులు జలధులు జఠరంబు
పవనాప్తు డాస్యంబు దివము నాభి,
నద నదీచయములు నాద సమూహముల్
కాలంబు గతి సుధాకరుఁడు మనము,
శైలంబు లస్థులు జలదముల్ కచములు
ధర్మంబు హృదయమై దనరు నట్టి,
గీ॥ నీదు రూపము శాశ్వత నిరుపమాన
నిత్య పరతత్వ శివ మన నెగడుగాదె?
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ ధారుణీ తరుణికి తప్త కాంచన రత్న
శోభితం బైన చేర్చుక్క రీతి,
గౌతమీ కృష్ణాపగా మధ్య నాచంట
యన్పేర విఖ్యాతి నలరు పురిని,
నెలకొన్న పద్మవ కులమున మేకాన్వ
యాబ్ధికి రాకా శశాంకు డనగ,
దనరు నాగయ్య తత్పత్నికి నారీమ
తల్లి చెల్లమ్మకు తనయు లెన్న,
గీ॥ ముప్పరం దగ్రజుండను బుధహితుండ,
బాపనాఖ్యుడ నర్పింతు పద్య శతము!
బుధ జనోల్లాస! ఆచంట పుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ ఈశ్మరమణీమణి మస్తక విన్యస్త
మహిత రత్న ప్రభా మంజువితత,
భూషణాయిత గతి పొలుపొందు నాచంట
పురమున పాద సంభూతజాతి,
నలరు మేకాన్వయ కలశ వారాశ్యబ్జ
నాగయ్య చెల్ల మనంగ నొప్ప,
నిరుపుర కానంద కరముగా నగ్ర సూ
నుడ బాపనాఖ్యత బొడమినాడ,
గీ॥ పరగ నుర్వీసుపర్వ సుపర్వ చరణ
వనజ పూజావినిర్మల వర్తనుండ!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

సీ॥ శాలివాహనశక సంవత్సరములలో
భూత గజాచల శీతకిరణ,
సంఖ్యాక దుందుభి సంవత్స రాశ్వీజ
సితపక్ష పంచమీ చిత్రభాను,
దినమందు భవదీయ దివ్య పాదార్పిత
మతి శతకంబు నే నతులభక్తి,
గూర్చితి నెందాక కుధర కూర్మకులోల
కుంభి కుంభీనస కోక కుముద,
గీ॥ బంధు లుందురు నందాక భవ దపార
కరుణ నిదియొప్పుగాత సత్కవుల సభల;
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల! 140

సీ॥ ఆచంట పురవర మాలయంబున నున్న
గోపాల! గోవింద! గోపబాల!
గోవర్ధ నోద్ధార! గోగణరక్షణ!
విజ్ఞాపనముఁజేతు వినగదయ్య!
భక్తినే జేసిన పద్య శతంబిది
విని వ్రాసి చదివెడు జనులకెల్ల,
పుత్ర మిత్ర కళత్ర భోగ భాగ్యైశ్వర్య
ధనధాన్య కరి హరి ధామ హేమ,
గీ॥ భూషణంబు లిహంబున బొసగ నొసగి,
యంతమున ముక్తి దయజేసి యరయు మయ్య!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్తజనపాల! మదన గోపాల బాల!

సీ॥ పుట్ట మెట్టల బుట్టి పొగడొందు వారల
హేళికాఖ్యులసేవ నెసగుచున్న,
వారల పదములు వలనొప్ప సేవించి,
పగలు రాతిరి వెల్గు బరగు వారి,
నామముల్ వ్రాసిన యా మహామహులను
భాగవతంబును భారతంబు,
తెనుగు బాస యొనర్చి తేజరిల్లిన వారి
నుతియించి యద్యతనులకు మ్రొక్కి,
గీ॥ శతక మొక్కటి భవదీయ చరణములకు
జేతు నర్పింతు దీనిని చిత్తగించు!
బుధ జనోల్లాస! ఆచంటపుర నివాస!
భక్త జన పాల! మదన గోపాల బాల!

మదన గోపాల శతకము.

సంపూర్ణము.



# సంక్షేప రామాయణము.

శ్రీరామరామ । సర్వముపర్వసమేత శతానందప్రార్థితరామ । కష్ట దుష్టదైత్యదానవ సంఘాత కర్షిత భూభార నివారణావ తరణరామా । రవి వంశపవిత్రరామ । మనువంశకేతోరామ । యిక్ష్వాకువంశ ప్రథరామ । కకుస్థకులతిలకరామ । రఘురామ రాఘవరామ । రఘువంశపయోనిధిసోమరామ। దశరథ రాజనందనరామ । దయానిధేరామ । దాశరథేరామ । పంక్తిరథాగార పరిష్కార హరిన్మహేరామ । కౌసల్యానందవర్ధనరామ । కౌసల్యాగర్భ రత్నాకర పరిపూర్ణచంద్రరామ । కౌసల్యాగర్భశుక్తిముక్తామణేరామ । కౌసల్యాసుకృత వ్రాతకల్పక ప్రసవోదయరామ । భరతలక్ష్మణ శతృఘ్నాగ్రజరామ । గాధేయమౌనీంద్రానుగతరామ : తాటకా ప్రాణహరణరామ । కామాశ్రమ ప్రవేశరామ । సిద్ధాశ్రమ ప్రవేశరామ । సుబాహూన్మత్తమాతంగ సంహార వరకంఠీరవరామ । మారీచమదభంగరామ ! తదనుచర రాక్షసానీకనిషూదనరామ । కౌశికమఖ సంరక్షకరామ । జనకయాగావిలోకన కుతూహల సమేతరామ । గౌతమీసతీ శాపవిమోచక పదరజోలేశరామ । అహల్యావినుత చరితరామ । శతానంద జననీపూజిత చరణారవిందరామ । హరిచాపఖండనరామ । సీతాపరిగ్రహరామ భూపుత్రీకళత్రరామ । జనకజాజానేరామ । జానకీరమణరామ । మైధిలీవల్లభ రామ । వైదేహీప్రియరామ । అవనిజాప్రాణనాథరామ । జనకధౌత చరణారవిందరామ । పరాక్రమ పరాజిత భార్గవరామరామ । అయోధ్యాపుర ప్రవేశరామ । పితృనియోగాంగీకృత వనవాసరామ । సుమంత్రబోధిత రాథారూఢరామ । తమసాతీరగత రామ । గుహపూజిత చరణారవింద రామ । గుహవినుత చరిత రామ । తీర్ణగంగా ప్రవాహరామ । గుహనీతవటక్షీరవిబద్ధ జటామకుటాభి రామ రామ । భరద్వాజాశ్రమ ప్రవేశరామ । భరద్వాజపూజిత చరణారవింద రామ । భరద్వాజవినుత చరితరామ । చిత్రకూట విహారరామ । వాల్మీక

సంభవాశ్రమ ప్రవేశరామ । వాల్మీకి వినుతచరితరామ । వాల్మీకి పూజిత
చరణారవిందరామ । వాల్మీకిప్రదర్శితపర్ణశాలా ప్రవేశరామ । పితృమరణా
కర్ణనాకులచిత్తరామ । తిలోదక ప్రదాననిష్పన్నకృత్యరామ । భరత ప్రార్థిత
పునరాగమనరామ । పాదుకాదాన సంతుష్టభరతరామ । కాకాసుర మద
హరణరామ । దండకవనగమనోద్యమ సమేతరామ । అత్రి మౌనేంద్రా
శ్రమ ప్రవేశరామ । అత్రి పూజిత చరణారవిందరామ । అత్రి వినుత
చరితరామ । అత్రి ఛాత్రప్రదర్శిత దండకవనమార్గరామ । విరాధ వధపం
డితరామ । విద్యాధర రాజవినుత చరితరామ । విద్యాధర రాజపూజిత చర
ణారవింద రామ । విద్యాధర రాజమోక్షప్రదాయకరామ । శరభంగాశ్రమ
ప్రవేశరామ । శరభంగవినుత చరితరామ । శరభంగ పూజిత పాదారవింద
రామ । శరభంగ దత్తతపః ఫలపరిగ్రహరామ । దర్శనానందిత దండక
వనవాసి మునినివహరామ । మునిజన ప్రార్థనావిలోకిత సర్వము నిజనాశ్రమ
ప్రవేశరామ । తత్తదాశ్రమాంతరవాసి ఘాతకకోటినీ కరకీకసప్రకర విలో
కనవిస్మితచిత్త రామ । మునిజనాభయ ప్రదాయకరామ । అశేష రాక్షసా
నీక నిబర్హణ సంధాసమేతరామ । సుతీక్ష్ణాశ్రమ ప్రవేశరామ । సుతీక్ష్ణ
వినుత చరితరామ । సుతీక్ష్ణ పూజిత చరణారవిందరామ । అగస్త్యానుజా
శ్రమ ప్రవేశరామ । అగస్త్యానుజవినుత చరితరామ । అగస్త్యానుజ పూజిత
చరణారవిందరామ । అగస్త్యానుజ కృతాతిథ్య సంతోషిత స్వాంతరామ ।
అగస్త్యాశ్రమ ప్రవేశరామ । అగస్త్యవినుత చరితరామ । అగస్త్య దత్త
శరధి శరాసన చంద్రహాస సమేతరామ । అగస్త్య నిర్దిష్ట పంచవటీ తీర
నివాస గౌతమీజల సుస్నానకలితరామ । శూర్పణఖాకర్ణ నాశికాచ్ఛేదకరామ ।
ఖరదూషణాది దుష్టనక్తంచరస్తోమ ధూమకేతువిజృంభణరామ । మాయా
మృగ విదారణ విచక్షణరామ । సీతావియోగ సమన్వితరామ । సీతాన్వేషణ
తత్పరరామ । గృధ్రరాజ మోక్ష ప్రదాయకరామ । యోజనబాహు బాహు
విచ్ఛేదకరామ । గంధర్వరాజ వినుత చరితరామ । గంధర్వరాజ పూజిత
చరణారవిందరామ । విశ్వావసునిబోధిత శబరి విలోకనరామ । శబరిపూజిత

చరణారవిందరామ । శబరివినుతచరితరామ । శబరీకధితసీతావృత్తాంతరామ।
శబరీనివేదిత సుగ్రీవ సఖ్యరామ । పంపాసరోవరతటగతరామ ఋష్యమూ
కాద్రి ప్రవేశరామ । పటువేషకలిత హనుమత్సంభాషణ సంతోషితస్వాంత
రామ । సుగ్రీవసఖ్యాభినందితరామ । సుగ్రీవ ప్రదర్శిత సీతాభూషణవ్రాత
రామ । సుగ్రీవ సఖ్యాభినందితరామ । సుగ్రీవ ప్రదర్శిత సీతాభూషణవ్రాత
రామ। సుగ్రీవ కధితవాలివిజయోచంతరామ। సుగ్రీవ వినుతరామ। సుగ్రీవ
పూజితరామ। సుగ్రీవ ఖేదాపనయనచతురపత్యయ ప్రదర్శకరామ। దుందుభి
మస్తకోత్క్షేపకరామ । సప్తసాల విచ్ఛేదకరామ । వాలినిషూదనరామ । తారా
శోక నివారక తత్వావబోధకరామ । వానరరాజ దానసంప్రీణిత సుగ్రీవ
రామ । ప్రవర్షణ గిరిగుహానివాస రామ । లక్ష్మణానేత విస్మృత సుగ్రీవా
పరాధ క్షమాపణరామ । సీతాన్వేషణ ప్రహిత వానర వీరరామ । వాయు
తనయ ప్రేషిత ముద్రికా ప్రతాన సంతోషిత సీతా స్వాంతరామ । వాత
సుతా నేత సీతా శిరో రత్న దర్శనానందితరామ । వాయుతనయకృత
సముద్రతరణ లంకాదాహనాది రాక్షసనిన దాకర్ణన విస్మిత చిత్తరామ ।
సర్వవానర సేనాసమేత రామ । జలనిధితీరగతరామ । సాగరసముత్తారణ
చింతాతత్పరరామ । శరణాగత విభీషణాభయప్రదాయక రామ । విభీషణ
వినుతరామ । విభీషణ పూజితరామ । లంకారాజ్యాభిషేచనానంది విభీషణ
రామ । జలనిధి మదవిశోషణ ప్రవణబాణరామ । చరణానతమూర్తి మజ్జ
లనిధి సన్నుత చరితరామ । జలనిధి దత్తమహారత్నోపాయన పరిగ్రహ
రామ । సాగరాభయ ప్రదాయకరామ । సేతుబంధనరామ । సముద్రతరణ
రామ । వానరసేనాసమాక్రాంత సువేలాచలరామ । ప్రహస్తకుంభనికుంభ
మహోదర మహాపార్శ్వదేవాంతక నరాంతకాతికాయ మహాకాయ విద్యు
జ్జిహ్వాగ్నివర్ణ ఖడ్గరోమ వృశ్చికరోమ సర్పరోమాది దుష్టనిశాటనిషూదన
రామ । కుంభకర్ణమదాంబోధిస్తంభన కుంభసంభవరామ । రావణ ప్రాణ
హరణరామ । లంకాసుర సంహారరామ । అగ్నిప్రవేశ నిర్మల సీతాసమేత
రామ, శతముఖ చతుర్ముఖ పంచముఖ ప్రముఖ నిఖిలబహిర్ముఖ వినుత

రామ । సుగ్రీవాంగద సుషేణాంజనేయాది వానరవీర పరివృతరామ । విభీషణాది దైత్యేంద్ర సమన్వితరామ । పుష్పకారూఢరామ । భరద్వాజాశ్రమ ప్రవేశరామ, దర్శనానందిత భరతరామ । గోరీచకృత నందిత గ్రామరామ । అయోధ్యాపుర ప్రవేశరామ । పౌరనారీజనవిలోచన చకోర పరిపూర్ణచంద్రరామ । పట్టాభిషేక మహోత్సవానందిత సర్వలోకరామ । ధర్మమార్గప్రవర్తిత సర్వప్రజాసమూహరామ । అశ్వమేధాదియాగదీక్షిత రామ । కుశలవజనకరామ । సమధికసామ్రాజ్యసంస్థాపిత కుశలవరామ । అయోధ్యాపుర చరాచర మోక్షప్రదాయకరామ । వైకుంఠవాసరామ । శేష శయనరామ । చక్రధరరామ, పాంచజన్యధరరామ । రమామణి మనోహరరామ । అనంత గరుడకుముద పుష్ప దంతవిష్వక్సేనార్హణనందసనంద సనకసనందన సనత్కుమారసనత్సుజాతాదిపార్షదవ్రాత సమేత రామ । ప్రహ్లాద నారద పరాశర పుండరీక వ్యాసాంబరీష శుకశౌనక భీష్మదాల్భ్యాది పరమభాగవత సంఘాత సంస్తూయమాన చరిత్రరామ । భక్త రక్షకరామ । శ్రీరామాయనమోనమః॥

# శ్రీ విష్ణు అష్టోత్తర శత రామ నామావళి.



శ్రీ రామ। శ్రీరామ రామ। సీతా రామ। అయోధ్యాపతే రామ। అచ్యుత రామ। అనంత రామ। అవ్యక్త రామ। అమృత రామ। అనాధినిధన రామ। అఖిలాండకోటి బ్రహ్మాండనాయక రామ। అప్రమేయ రామ। అమేయగుణ రామ। అహల్యా వినుత చరిత రామ। అవ్యయ రామ। ఆదిదేవ రామ। ఆద్యంత రహిత రామ। కమనీయ విగ్రహ రామ। కమల నాభ రామ। కమల నయన రామ। కమలా మనోహర రామ। కరిరాజ వరద రామ। కల్యాణ గుణైకతాన రామ। కామిత ఫలదాయక రామ। కాకుస్త్తిలక రామ। కాంచనచేల రామ। కేశవ రామ। కేవల రామ। కోదండ రామ। కౌసల్యా నందన రామ। కౌమోదకీధర రామ। కౌస్తుభాభరణ భూషిత వక్షస్థల రామ। కందర్పజనక రామ। కౌశిక మఖ సంరక్షక రామ। చక్ర ధర రామ। జయ రామ। జగదీశ రామ। జగజ్జాల వీక్షా దీక్ష కటాక్ష వీక్షణ రామ। జానకీ రమణ రామ। దశరథ రామ। దయానిధే రామ। దాశరథే రామ। దీనరక్షక రామ। దీన పోషక రామ। దీన బాంధవ రామ। దీన శరణ్య రామ। దీన పరాధీన రామ। దీనదయా పరమూర్తే రామ। దీనజన చింతామణే రామ। దీన కల్పక రామ। నిత్య రామ। నిర్గుణ రామ। పట్టాభి రామ। పన్నగతల్ప రామ। పరాత్పర రామ। పరమపవిత్ర రామ। పతిత పావననామరామ। పరంధామ రామ। పరమ పురుష రామ। పరమేశ్వర రామ। పరమ దయానిధే రామ। పరమేష్ఠి సన్నుత రామ। పశుపతీ మిత్ర రామ। పతక పతకేతన రామ। పద్మనాభ రామ। పంకజ లోచన రామ। పాంచజన్య ధర రామ। పాప తమఃపతంగ రామ। పాకశాసన వినుత రామ। పార్ధసారధి రామ। పాండవపక్ష రామ। పురుషోత్తమ రామ। పుణ్య రామ। పురాణ పురుష రామ। పుండరీకాక్ష రామ; భక్తరక్షక రామ। భువన సాక్షి రామ।

మాయా[illegible] [illegible]మరామ! రావణ విరామ! రఘు రామ! రణరంగధీర రామ! రవికుల జలధిసోమ రామ! రంజిత గుణగణ రామ! రాక్షసాంతక రామ! రాజీవ నయన రామ! రాఘవ రామ! రాజకుల రామ! రామ రాఘవ రామ! విభీషణ పూజిత రామ! వైకుంఠవాస రామ! శబరి ఫలభక్షణ రామ! శాశ్వత రామ! శాంత రామ! శేష శయన రామ! సత్య రామ! సనాతనరామ! సర్వతోముఖ రామ! సర్వేశ్వర రామ! సర్వజ్ఞరామ! సుబ్రహ్మణ్యరామ! సౌమ్యరామ! హరే రామ! హర చాప ఖండన రామ! హిరణ్య గర్భ రామ! హిరణ్య నాభ రామ! రామ రామ! శ్రీరామ రామ! రామ రామ! నమోన్నమః॥

